## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020010005998

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# మాట-మన్నన!

గొర్రెపాటి వెంకటసుబ్బయ్య



# పీఠిక

సంభాషణ జీవితానందాల్లో గొప్పది. మంచి సంభాషణంత మధురమైనది మరొకటి లేదు. ప్రతి వృత్తిలోనూ అనుభవం గడించదలచేవారు నిత్యావసరమైన సంభాషణా ప్రయోజనాలను ఎందుకుగుర్తించరో ఎరుకపడకున్నది. ఇది అందరి అందుబాటులో నున్నది. కాని చాలామంది ఈ సుఖాన్ని అనుభవించలేకున్నారు. ఇది ఒక బ్రహ్మవిద్యగా భావిస్తారు.

నేను ఆ సభకు వెళ్ళాను, ఈ విందుకు వెళ్ళాను. కాని నోరు మెదపటం చాతకాదు అంటారు. మానవులు స్నేహాన్ని కోరతారు. ఆ స్నేహం వారి సంభాషణా జ్ఞానంవల్లనే నెరవేరుతుంది. మనం ఈ ప్రపంచంలో ఏకాకిగ బ్రతకలేము, కనుక ఇతరులతో పరిచయం పొందగోరుతాం. స్నేహం చేయగోరుతాం. నలుగురితో కలసి మెలసి వుండటంద్వారా ఆనందింపగోరుతాం. కనుక సంభాషణ ఆనందాన్ని అనుభవించ కోరతారు. కాని ఎట్లా మాట్లాడాలో ఎరుగరు కొందరు.

సంభాషణ అనేది దైవదత్తం కాదు. అది శిల్పం. కనుక అది నేర్చుకొని ఉపయోగించుకొనవచ్చును. స్వభావసిద్ధంగా ఈశక్తి లేనివారు నేర్చుకొని పెంపొందించుకొని ఆనందించ వచ్చును.

ఈ పుస్తకం అటువంటివారికి ఉపయోగం కాగలదనే ఉద్దేశంతో కూర్చాను.

ఇటువంటి పుస్తకాలు ఇంగ్లీషులో ఎన్నో వున్నవి :

How to win friends and influence people అనే గ్రంథం అధిక ప్రచారం కలది. దీన్ని చూచినపుడు ఇటువంటి పుస్తకం తెలుగులో అవసర మనుకున్నాను.

ఈలోగా మా అన్నగారు మునిమాణిక్యం నరసింహారావుగారు మంచివాళ్ళు-మాటతీరూ' 'మాట నేర్పరితనం' అనే పుస్తకాలు వ్రాశారు.

తర్వాత నేను The art of conversation by Betty E. norris రచించిన పుస్తకాలను చూచాను. వానిని ఆధారంగా చేసుకొని దీన్ని రచించాను.

ఆ రచయిత్రికి కృతజ్ఞతాపూర్వక వందనములు.

ఘంటసాల, 30—4—59. } గొర్రెపాటి వెంకటసుబ్బయ్య.

# విషయ సూచిక:

# సంభాషణా ప్రయోజన ప్రాముఖ్యాలు

ఆదిమ సమాజమునుండి అత్యున్నత స్థితిగాంచిన నేటివరకు తన అభిప్రాయాలను తెలియ జేయటానికి మానవుడు ఎడతెగని కృషిచేశాడు. పశు పక్ష్యాదులు కూడా తమతమ అరుపులవల్ల తమ భావాలను ఇతర జంతుజాలానికి తెలుపుతవని కొందరు ఆలోచనాపరులు అంటున్నారు. అనటమే కాదు; పూర్వము పశుపక్షుల భాషలను మానవులు కొందరు నేర్చినట్లు గ్రంథాలద్వారా తెలుస్తున్నది. పాశ్చాత్యులు అధికపరిశ్రమ చేసి వానరాది జంతువుల భాషలను తెలుసుకొన్నట్లు తెలుస్తున్నది.

ఆది మానవుడు ప్రథమంగా ధ్వనుల వల్లనే తన అభిప్రాయాలను తెలియపర్చాడు. కనుక మానవుడు సంభాషణవల్లనే తన అభిప్రాయాలను ఇతరులకు తెలియజేయును. తన అభిప్రాయాన్ని ఇతరులకు చెప్పటమే సంభాషణ. కనుక దీన్ని సాధ్యమైనంతవరకు జయప్రదంగా జరుపుటకు ఎందుకు కృషి చేయకూడదు ? సంభాషణ అంటే మనస్సుల కలయిక అని నానుడి పుట్టింది. కనుక ఆ కలయికవలన కలిగే ఉత్తమ లాభాన్ని మనము ఎందుకు పొందగూడదు ?

పరస్పర మన సమ్మేళనవల్ల మానసికాభివృద్ధి పొందటమే సంభాషణా ప్రయోజనం. ఈ ప్రయోజనం పొందుటకు అనేకులతో సంభాషించుట అవసరం.

గుహలో నివసించిన మానవునకు అతని అవసరాలు, అతని లోకము, అంతా అల్పమే. అందుచేతనే అతని ఆలోచనలు చాలా తేలికైనవి. అతని జ్ఞానం స్వల్పం. అతని మేధ పెరగలేదు. అతనిది కొంచపులోకం. కనుక ఆ సంఘానికి కొద్దిపాటి సంభాషణే అవసరమైనది. కాని ఈ నాటి లోకం అతివిశాలం. అయినప్పటికి అందరూ అన్ని విషయాలు తెలసినవారు కారు. ఏదో విషయం అధికంగా తెలిసిన వారున్నారు నేడు. కనుక మన జ్ఞానాభివృద్ధికి ఈ అందరితోను సంభాషించటం అవసరం. దేశాటనం, వారాంగనా పండిత మిత్ర సంభాషణ అవసరమన్నారు పూర్వులు. వారాంగనలు ఈ నాటివారివలె కేవలం శరీరాన్ని అర్పించేవారు కారు. వారు సమస్త విద్యల్లోనూ ఆరితేరినవారు. అందుచేతనే వారిని కళావంతులు అన్నారు. కనుక వారితో మాట్లాడటమే విద్య.

పల్లీయుల సంబంధం పరిమితం. వారు తోటివారితోను, వైద్యుడు, పురోహితుడు, టపాబంట్రోతు మొదలగు కొద్దిపాటి మిత్రులతో సంభాషింతురు.

కాని పట్టణవాసి అసంఖ్యాకులతో ముచ్చటించాలి. కనుక భావాలను సరిగా వెల్లడించటానికి సంభాషణ అవసరం. డాక్టరులతో తన జబ్బును, వర్తకునితో తన అవసరాలను, వకీలుతో తన తగాదాలను, కూలీలతో తన పనులను చెప్పవలసివున్నది.

వేయేల! మాటవల్లనేగదా మైత్రి. మాటలేనివాని బ్రతుకు బ్రతుకుకాదు. కనుక సంభాషణ విలువ అంతా

ఇంతా కాదు; అత్యధికమైనది. రచనద్వారాకూడా అభిప్రాయ ప్రకటన జరిగేమాట వాస్తవమే. మన ప్రాచీన సాహిత్యమే ఈనాటి సంస్కారాని కంతకూ కారణం. కాని ఎందరు మనలో రచయితలు? కనుక మన అభిప్రాయాలు ఇతరులకి తెలియజేయటానికి, పరుల ఆలోచనలు తెలుసుకోవటానికి సంభాషణ తప్పనిసరి అని గ్రహించాలి. సంభాషణ ఒక లలితకళ. అది ఒక కళేకాదు ఒక శాస్త్రం కూడా. మంచి మాటకారులం కావాలంటే మనం కొన్ని నియమాలు అభ్యసించాలి. మనలో కాస్తఓపిక, ధ్యానము, పరిశీలన ఉంటే దీన్ని అభ్యసించటం ఏమంత కష్టంకాదు.

సంభాషణ మనకు తెలుసుననీ అది సహజంగానే అలవడుతుందనీ అనుకుంటాం. కనుక వేరే నేర్చుకోవలసిన అవసరం లేదనితలుస్తాం. బాగామాట్లాడటం, సంభాషించటం ఒకటని అనుకోకూడదు. బాగా మాట్లాడేవారిలో చాలా మంది బాగా సంభాషించలేరు. గొప్ప గొప్ప కవులుకూడా మంచి సంభాషణ కర్తలుకారు. మంచి సంభాణ కర్తలతో మనము మాట్లాడుతున్నప్పుడు మన అశక్తత గోచరం అవుతుంది. అప్పుడు వారి ఎదుట మూగవారిలాగె వుండి సిగ్గుపడవలసి వస్తుంది.

సంభాషణను అయిదు విధాలుగా విభజింపవచ్చు. వర్తక వాణిజ్యాల సంబంధం, సాంఘిక సందర్భాలు, మిత్రులమధ్య, పండితగోష్ఠి, నిత్య వ్యవహారాలు.

మొట్టమొదటగ మనం వ్యాపార సంబంధమైన సంభాషణసంగతి ఆలోచించుదాం. సరిగా సంభాషణ

చేయకపోతే చాలా దెబ్బతింటాం. ఉదాహరణకు ఒక వ్యాపారస్థుడు తనకు కొందరు పనివారు కావాలని ప్రకటించా డనుకోండి. అప్పుడతను వచ్చిన దరఖాస్తుదారులను వరసనే పిలచినప్పుడు వారు సరిగా సంభాషణ చేయలేకపోతే వారు వచ్చిన దారి పట్టవలసిందే. నేర్పు లేనిదే ఏమీ ప్రయోజనం లేదు. యజమాని పలకరించగానే తనయందు సద్భావము కలిగేటట్లుగ సమాధానం చెప్పవలసి వస్తుంది. అట్లా చెప్పినవాడే జయం పొందగలడు. అట్లా సరిగా సమాధానం ఎంతమంది చెప్పగలరు ?

అట్లాగే వర్తకంలో కూడా. వస్తువులను అమ్మటంలో నేర్పరత్వం అంటే మాటకారితనం అన్నమాట. షాపులోకి వచ్చినవారిని మర్యాదగా పలకరించి, వారు అడిగే వస్తువుల నాణెమును గురించి, ధరలను గురించి వారికి నచ్చేటట్లు చెప్పి, వారిని కొనేటట్లు చెయ్యాలి. వారితో వాద వివాదాలు పెట్టుకోరాదు. వ్యాపారమంతా సంభాషణా చాతుర్యంమీదనే ఆధారపడివుంది.

వైశ్యులకు ఇతరులకూ వర్తకంలో తేడా ఇదే. వారివలె మర్యాద మన్ననగ, ఓపికతో వచ్చినవా రందరితో మాట్లాడగల నేర్పు ఇతరులకు తక్కువ.

పెట్టుబడికంటె వర్తకులకు ముందు మాటల పొందిక ముఖ్యమని గుర్తించాలి.

ఇతర వృత్తులవారుకూడా రాణించాలంటే సంభాషణ చక్కగా తెలిసినవారై ఉండాలి. బాగా చదువుకున్నవారికంటె, బాగా మాట్లాడటం నేర్చినవారే తమ పనులలో

నెగ్గటం మనం కళ్లారా చూస్తున్నాం. సంభాషణలో నేర్పరత్వం లేనిది ఎవరూ ఎందులోను నెగ్గలేరు.

సంభాషించేటప్పుడు మన ధోరణిలో మనం ఉండరాదు. మన మాటలను వారు ఎట్లా స్వీకరిస్తున్నారో గ్రహించాలి. అవతలవారితో మాట్లాడేటప్పుడు వారి అభిమానాలు, అయిష్టాలు గుర్తించాలి. వారి ముఖ కవళికను గమనించాలి. మన మాటలు వారిమీద ఎట్లాపనిచేస్తున్నవో కనిపెట్టవలసి ఉన్నది.

ఎవరైనా రాగానే ఎందుకు వచ్చారో గ్రహించి, అందుకు తగినట్లు మాట్లాడాలి.

వచ్చినవా రందరితోను ఒకే మాదిరిగా మాట్లాడరాదు. వారి వారి స్థాయిని గుర్తించి వ్యవహరించాలి.

మన స్తత్వ శాస్త్రజ్ఞుడే మంచి సంభాషణకర్త కాగలడు. ఆ శాస్త్రం చదవాలనికాదు; అనుభవంద్వారా గ్రహించాలి.

సాంఘిక జీవితంలో సంభాషణ నిత్యావసరం. మాట్లాడుతూ ఉంటే, చూస్తూ నోరు మెదపకుండా ఉండేవారు అగౌరవం పొందుతారు. అతను ఒంటరితనం అనుభవిస్తాడు. మానవుడు సంఘజీవి కనుక సంభాషణ చక్కగా చేయవలసిన అవసరం అధికం. అతడు సాంఘికంగా జయం గాంచాలంటే చక్కని సంభాషణకర్తయి ఉండాలి.

విందులకు వినోదాలకుగాని నలుగురు కలిసిఉన్నప్పుడుగాని మౌనవ్రతం పూనితే ప్రయోజనం శూన్యం. కలసిమెలసి చక్కగా మాట్లాడాలి. అందరితో అప్పుడు మైత్రి

ఏర్పడుతుంది. సంభాషణద్వారా ఆకర్షించాలి, ఆకర్షింప బడాలి. నాలుగు సంగతులు తెలియాలన్నప్పుడు నలుగు రుతో మెలగాలి.

చక్కగా సంభాషించగలవారికి జీవితంలో కావల సింది ఏమిటి? వారు పొందే ఆనందం అనితరలభ్యం.

సంభాషణకర్త లందరు ఒక శ్రేణికిచెందిన వారు కారు. సంభాషణా సంబంధమైన పుస్తకాలు చదివినవారు కొందరు, బాగా చదువుకొన్న వారు కొందరు, ఇంకా గొప్ప సంస్కారం గలవారితో మెలిగి నేర్చుకున్న వారు మరికొందరు. మొత్తంమీద వీరంతా సంభాషణను గుర్తిం చిన వారే. సంభాషణా ప్రయోజన ప్రాముఖ్యాలను గుర్తించకపోతే మన సంభాషణ రాణించదు.

సంభాషించే నేర్పుగలవారికి సంస్కృతి గలవారి సర సన కూర్చునే యోగ్యత కలుగుతుంది. నేర్పుగా సంభా షించేవారు కొద్దో గొప్పో మానవ ఆలోచన (thought) అభివృద్ధికి ఆధారభూతులు.

మంచి సంభాషణకర్తలు సాంఘికంగా రాణిస్తారు. సంభాషణద్వారా తెలివితేటలు పొందుతారు. సాంఘిక గౌరవం పెరుగుతుంది. నలుగురితో మాట్లాడితే గాని భిన్న దృక్పథాలు మనకు తెలియవు. మంచి ఉద్దేశాలు మనకు కలగవు.

మాట్లాడేటప్పుడు సమయాన్ని గుర్తెరిగి మాట్లాడాలి. వారు ఏస్థితిలో వున్నారు, ఏదైనా దీర్ఘాలోచనానిమగ్నులై వున్నారా; లేక కులాసాగా మాట్లాడుకుంటున్నారా అని.

చదువుకున్న వారు తాము చదివిన గ్రంథాలనిగురించి మాట్లాడుకోవటం అవసరం. ఒక్కొక్కరు ఎట్లా భావించారో తెలుస్తుంది.

బంధుమిత్రులు, ఇంట్లోవారు కలసి సంభాషించటం అల్పసంగతి అని ఎంచరాదు. దీనివల్ల లాభం లేదని కొందరు తలుస్తారు. మన అనుభవాలను పంపొందించుకొనుటకు ఇదికూడా ఎంతో ప్రయోజనకారి.

వీరంతా మనలోవారుకనుక వెరపులేకుండా మన భావాలను చెప్పుకోవటానికి అవకాశం ఉంటుంది. పరస్పర క్షేమాభిలాషులైన వీరి సంభాషణ పరమ ప్రయోజనకారి.

నాల్గవది విద్వద్గోష్ఠి. ఇది మన మెదడు అభివృద్ధి పొందటానికి అధికంగా తోడ్పడుతుంది. వారి సంభాషణ అంతా క్రమబద్ధమై పాండిత్య ప్రకర్షలను ప్రదర్శించేదిగా ఉంటుంది. ఉన్నత భావలబ్ధికి జ్ఞానాభివృద్ధికి ఇటువంటి గోష్ఠులు అధికంగా తోడ్పడుతాయి. పూర్వం విద్వద్గోష్ఠులు అధికంగా ఉండేవి. ఉపన్యాసాలకంటె ఇటువంటి గోష్ఠుల వలన ప్రయోజనం అధికం.

చివరికి మిగిలింది దైనందిన సంబంధం. ఇది పరిమితమైన వాక్కులతో కూడింది. కాని ఇదికూడా అల్పమని అనుకోరాదు. దీనిలోనూ ఎంతో మర్యాద మన్నన ఉన్నవి. ఇతరులతో స్నేహ గౌరవాలు దీనివల్ల కలుగుతవి. విశేషంగా ఇది ప్రేమానురాగ సంబంధం. పరిచయులు కనపడగానే 'క్షేమమా?' అనటంతో వారియందెంతో మనం ప్రేమ కనపరుస్తున్నామన్నమాట. ఆమాటే మన హృదయం

నుంచి రావాలి. పెదవినుండి రాకూడదు. అదెంతో ప్రయోజనకరమైనది.

అట్లాగే పెద్దలు కనపడగానే 'నమస్కారం' అనాలి. అదొక మర్యాద. మర్యాద హీనుడు మానవుడు కాడు. ఇవి చూడటానికి అల్పమే. ప్రయోజనం అధికం. ఇటువంటి అల్ప విషయాలే మనకు గౌరవా గౌరవాలు తెచ్చేవి.

చిరునవ్వుతో వచ్చినవారిని కూర్చోమనాలి. వచ్చిన మనిషి కూర్చోడా అనేవారు లేకపోలేదు. వారికి మర్యాదా మనస్తత్వాలు రెండూ తెలియవన్నమాట. మన సంస్కారం ఈ ఆహ్వానంలో కనబడుతుంది.

బయటనుండి ఇంటికి రాగానే భార్యను నవ్వుతూ పలకరిస్తే ఆమె కష్టాలన్నీ తీర్చినట్లే.

అట్లాగే శ్రమపడి వచ్చిన భర్త ఇంటికి రాగానే ఆప్యాయతతో పలకరిస్తే అతని భారమంతా దింపినట్లే.

మాటలోనే అంతావుంది. అదిగుర్తెరిగి మాట్లాడాలి.

సర్వేసర్వత్రా సంభాషణేసంబంధాలను కలుపుతుంది. మాటంటే మనస్సు, మనస్సంటే మాట. మనస్సు కలిసే టట్లు నేర్పుకలిగి మాట్లాడాలి.

సంభాషణ అంటే కేవలం అభిప్రాయ వినిమయం కాదు. మనస్సుల కలయిక అని గుర్తించినపుడు మనం అభివృద్ధి గాంచగలం. అప్పుడు లోకకల్యాణం కలగ గలదు. సంభాషణా ప్రయోజనాన్ని గురించి ఎమర్సన్ ఇట్లా వ్రాశాడు:

"It is very certain that sincere and happy conversation doubles our powers, that in the effort to unfold our thought to a friend, we make it clearer to our selves, and surround it with illustrations that help and delight us. It may happen that each hears from the other a better wisdom than anyone else will ever hear from either. Speech is power; speech is to persuade, to convert, to compel. It is to bring another out of his bad sense into your good sense. You are to be a missionary, a carrier of all that is good and noble" So we can judge the value of our conversation by its influence on others.

Let us sum up in the words of Stevenson : "The first duty of man is to speak; that is his chief business in this world; and talk, which is more harmonious speech of two or more, is by far the most accessible of pleasure. It costs nothing; it is all profit; it completes our education; it founds and fosters our friendships and it is by talk alone that we learn our period and our selves"

సంభాషణలో పాటించదగిన విషయాలు :

కళల అన్నిటిలోవలే సంభాషణ కళలోకూడ కొన్ని నియమాలను తెలుసుకోవాలి. సంభాషించేటప్పుడు తప్పని సరిగ ఈ నియమాలను పాటించాలి. వీటిని పాటిస్తే మన

విజయం గాంచామన్నమాటే. మాట్లాడే పద్ధతి, మాట్లాడే విషయం, సంభాషణలోని సంగతులని గుర్తించాలి. అవి నియమాలని అనుకోరాదు. మాటల శక్తియుక్తులు మాట్లాడేటప్పుడు మనం పాటించే పద్ధతినిబట్టే ఉంటవి. కనుక ఆ పద్ధతులను జాగ్రత్తగా పాటించాలి మనం.

చిరునవ్వు, స్పష్టం, సంగ్రహం, నిరాడంబరం, మర్యాద, నేర్పు, నిజాయితీ, ఉపజ్ఞతని, మాధుర్యం, ఇవన్నీ మంచి సంభాషణకు అవసరాలు.

అందంగా వుండటానికి ఎన్నో నగలూ, నాణ్యాలు, దుస్తులు ధరిస్తారు. చిరునవ్వు లేకపోతే ఎన్నున్నా శవాలంకారమే. చిరునవ్వే అందర్నీ ఆకర్షించేది.

మాటలకంటె అభినయమే అధికంగా ఆకర్షించేది. 'నీవంటె నాకిష్టం. నిన్ను చూచి ఆనందించాను' అని అది చెపుతుంది.

తెచ్చి పెట్టుకొన్నది కాగూడదు చిరునవ్వు. హృదయము నుండి వెలువడాలి. నవ్వు అంటె సానుభూతి అన్న మాట.

గంభీర హృదయులను గాంచినపుడు భీతి, మూతి ముడుచుకున్నవారిని చూచినపుడు అయిష్టం; చిరునవ్వుగల వారిని చూచినపుడు పరమానందం కలుగుతుంది. ఇది నిత్య జీవితంలో అందరకు తెలిసిన విషయమే.

అనుభవంగల వర్తకులు చిరునవ్వుతో ఆహ్వానిస్తారు. అందుచేతనే "చిరునవ్వు నవ్వనివారు దుకాణము పెట్ట రాద"ని చీనాదేశపు సామెత.

కనుక సంభాషణలో ప్రధానమైనది చిరునవ్వు. నవ్వుతూ మాట్లాడుతుంటే సమాధానం నవ్వుతూ చెప్తారు. ఇది నిత్య జీవితంలో రాజమార్గం.

నవ్వుతూ మాట్లాడేవారిని అందరూ ప్రేమిస్తారు. అతను అధికంగా స్నేహితులను అందువల్ల సంపాదించుకొంటాడు. అందరకూ మంచివాడవుతాడు.

ఆదరాభిమానాలను అందుకోవడానికి ఈ లోకంలో ఉన్నదల్లా చిరునవ్వు ఒక్కటే. ఈ దరహసిత వదనం జ్యోతిలాగా ప్రజ్వరిల్లి తన కాంతిచేత ఎనలేని ప్రయోజనాన్ని చేకూరుస్తుంది.

అందుచేత మిత్రులు కనబడగానే చిరునవ్వు నవ్వాలి. అది మాటలకంటె అధిక ప్రయోజనకారి

ఇతరులను చిరునవ్వుతో పలకరించడం నేర్చుకుంటే, ప్రపంచంలో చిర చిరలాడే ముఖం ఉండదని ఒక సుప్రసిద్ధ ఆంగ్లేయుడు అన్నాడు.

## స్పష్టత :

మనం మాట్లాడేది అవతలవారికి తెలిసేటట్లు చెప్పవలసి ఉంటుంది. మనస్సులోని సంగతి యితరులకు తెలిసేటట్లు చెప్పకపోతే ప్రయోజనమేమి?

తెలిసేటట్లు మాట్లాడటానికి ముందు మనం మాట్లాడే సంగతి మనకు బాగా తెలియాలి. మన అభిప్రాయాల్లో తికమకలు ఉంటే, వినేవారికి ఎట్లా తెలుస్తుంది? కొందరికి మంచి అభిప్రాయాలు ఉంటవి. కాని అవి ఇతరులపై

ప్రభావం కలుగజేయలేవు. దీనికి కారణం వారి అభిప్రాయాల్లో తికమక, లేక చక్కగా వెలిబుచ్చలేకపోవటం.

భాషా దారిద్ర్యమే సుస్పష్టంగా చెప్పలేనందుకు కారణమని మన కొకప్పుడు తోస్తుంది. ఈ లోపం లేకుండా ఉండాలంటే చిన్నచిన్న వాక్యాలతో మాట్లాడటం మంచిది.

స్పష్టంగా చెప్పలేకపోవటానికి గల కారణాలలో ఒకటి మన భావాలను తగ్గుస్థాయిలో చెప్ప ప్రయత్నించటం. ఒక ప్రొఫెసరు తన భావాలను చిన్నపిల్లలకు చెప్ప ప్రయత్నించినపుడు ఇటువంటిది జరుగుతుంది. తర్వాత తన మాతృభాషలోగాక పరభాషలో మాట్లాడేటప్పుడు కూడా జరుగుతుంది.

ఏమాట ఎట్లా వాడితే, వాక్యరచన ఎట్లా చేస్తే వాక్యం భావ యుక్తంగా స్పష్టంగా ఉంటుందో వారికి తెలియదు,

స్పష్టంగా మాట్లాడేవారు శ్రోతల ఆమోద, హర్షాల్ని పొందగలరు.

## సంగ్రహం:

సంభాషణ సంగ్రహంగా ఉండటం అన్నివిధాల మంచిది. గొప్పవారు ఎప్పుడూ వాచాలురుకారు. వారు మితముగ భాషింతురు. వారి భావములు పలుకులు సమానముగ తూగును. ఆ మిత భాషలో జగత్తును నడుపు సూత్రముండును. వారి వచనములు సూత్రప్రాయములై ఉండును.

ధనం ఎంత జాగ్రత్తగా వాడుకోవాలో అంతకంటె పొదుపుగ మాట్లాడటం నేర్చుకోవాలి. అట్లా మాట్లాడితే వినేవారికి సొంపుగా ఉంటుంది. కాలహరణం వుండదు. సాధ్యమైనంతవరకు సంగ్రహంగా మాట్లాడటం ఉభయ తారకం.

నిరాడంబరం:

నిరాడంబరత్వం కళలన్నిటికీ మూలసూత్రం. ఆడంబరం లేనిమాట అందరిని ఆకర్షిస్తుంది. గాంధీమహాత్ముని మాటలు బహు నిరాడంబరంగా వుండేవి. గొప్పవారి గుణమే అది. భగవాన్ రమణమహర్షి అంతే. వారి పలుకెంత ఆడంబర రహితంగా ఉండేదో అంత అందంగా వుండేది.

సంభాషణలో వాగాడంబరం, పాండిత్య ప్రకర్ష చూపటం, గ్రాంధికంగా మాట్లాడటం పనికిరావు. ఏదైనా విద్వద్గోష్ఠి జరిగినపుడు కొంతవరకు సమయోచితంగా మాట్లాడవచ్చు.

తమ గొప్పదనాన్ని చూపెట్టుటకు కొందరు గూఢార్థాలతో మాట్లాడతారు. అది మంచిపనిగాదు. సంభాషణ ఎంత సంగ్రహంగా, సుబోధకంగా ఉంటే అంత మంచిది. నాటక రచన గొప్పగా భావించబడుటకు కారణము ఇదే. సంభాషణ సహజంగానూ, సంగ్రహంగానూ వుండాలి.

"Be simple, uneffected; be honest in your speaking and writing. Never use a long word when a shrot one will do ........ Where a

short word will do, you always lose by using a long one. You lose in clearness, you lose in expression of your meaning; and in the estimation of all men who are competent to judge, you lose in reputation for ability"

—BRYANT.

మర్యాద:

మాట మన్నన తేవాలి. మన్ననలేని మాట మాట కాదు. కనుక సంభాషణలో మర్యాద మన్నన చాలా అవసరం. సంభాషణలో అప్రియానికి నిష్కపటత్వానికి భేదం తెలియని వారున్నారు. అప్రియం మర్యాదకు భిన్నమైనది, తను భావించినట్లు నిజంగా మాట్లాడవచ్చును. కాని అది వినేవారికి అప్రియంగా వుండరాదు. సత్యం చెప్పేటప్పుడుకూడా అప్రియం చెప్పరాదు. అందుచేతనే 'సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాత్; నబ్రూయాత్ సత్యమప్రియం' అన్నారు. కనుక ప్రియంగా మాట్లాడటం నేర్చుకోవాలి. నిష్కాపట్యం అప్రియంకాదు; దానికి భిన్నమైనది.

ఎటువంటి సన్నిహితులతో మాట్లాడినా అప్రియంగా (Blunt) మాట్లాడరాదు. ఆమాట 'ఈటె' వంటిది. పరులకు వ్యధ కలిగేటట్లు ఎప్పుడూ మాట్లాడరాదు. కొందరి నోరు మాట్లాడుతూవుంటే నొసలు వెక్కిరిస్తుంది. ఇది అనర్థకరమైనది.

మర్యాద ఇచ్చి మర్యాద తెచ్చుకో మన్నారు. మర్యాదనేది దానంతట ఎవరికీ అది రాదు. మర్యాదవల్లనే లభిస్తుంది.

కాలు జారితే తీసుకోవచ్చును గానీ నోరు జారితే తీసుకోలేం.

నరంలేని నాలుక అని ఎట్లాబడితే అట్లా మాట్లాడ రాదు.

నాలుక స్వాధీనంలో వుంటే నరలోకమంతా స్వాధీన మవుతుంది.

## నేర్పరత్వం :

సంభాషణ సరసంగా వుండాలంటే నేర్పరత్వం అవ సరం. మనం ఏదో తొందరలో వేడితో మాట్లాడుతాం. ఆ మాటవల్ల ఎవరి హృదయానికైనా నొప్పి కలిగిందేమో నని గమనించాలి. గమనిస్తే వెంటనే ఆ విషయాన్ని మార్చి వెయ్యాలి.

పదిమందిలో క్షమాపణకోరటం పుండుపై కారం చల్లినట్లవుతుంది. అవసరమైతే ఒంటరిగా వున్నప్పుడు క్షమాపణ చెప్పటం మంచిది.

సంభాషణలో వివాదాస్పదమైన విషయాలు, వ్యక్తి గత విషయాలు విడువటం మంచిది.

## నిజాయితీ :

మర్యాద నేర్పరత్వాన్ని పాటించవలసిందని చెప్పిన తరువాత సంభాషణలో నిజాయితీ అవసరమనీ చెప్పవలసిన

పని లేదని తలచవచ్చు. కాని అట్లా తలచరాదు. నిజాయితీ అనగా నిష్కాపట్యము (Candour). కాని వీటిని పర్యాయ భావించరాదు. తెలివిగలవారి ముందు యుక్తిపరుల ఎదుట సిన్సియర్ ఒపినియన్ నిష్ప్రయోజనం.

మన విశ్వాసాలు సరియైనవి అయినట్లయితే వాటిని వెల్లడించడానికి సంకోచించరాదు. అభిప్రాయాలు (opinions) విశ్వాసాలు (convissions) ఒకటి కాదు. అట్లాగే ఆచారాలు విశ్వాసాలు ఒకటికాదు.

ఆచారం పరంపరగ వచ్చేది. అది విశ్వాసం వున్నా లేకపోయినా ఆచరించేదే. అందుచేతనే లోకంలో చాలా మంది ఆచారవంతులున్నారు గాని విశ్వాసవంతులు కారు.

ఉపజ్ఞ :

సంభాషణాపద్ధతు లన్నింటిలో ఉపజ్ఞ కష్టమైనది. ఉపజ్ఞతోకూడిన సంభాషణకు శైలి అవసరం. దీన్ని సంభాషించటానికి సంస్కృతిగలవారితో సంబంధం పెట్టుకోవటం సంభాషణాపద్ధతులు నేర్చుకోవటం మంచి సాహిత్యం చదవటం అవసరం.

ఒక విషయాన్ని గురించి ఆలోచిస్తున్నప్పుడు పరాభిప్రాయాన్ని గాక, తాను స్వయంగా ఆలోచించి చెప్పటమే ఉపజ్ఞ. చాలా విషయాలు నిరుత్సాహంగా వుంటవి, ఎందుకంటె విన్నవగుటచేత. ఒక విషయాన్ని గురించి మనకు బాగా తెలుసును అనుకుంటే మనం దానినిగురించి బాగా ఆలోచించ లేదన్నమాట. ప్రతిభ నవనవోన్మేషమైనది. సైంటి

స్టులు ఒక వస్తువునుగురించి తీవ్ర పరిశోధనచేసి ఎట్లా తెలుసుకుంటారో అట్లా మనం కృషి చెయ్యాలి.

మన సొంత అభిప్రాయాలు చెప్పేటప్పుడు దానికి తగిన ఉపమానమో తదనుగుణ్యమైన పరాభిప్రాయమో చెపితే బాగుంటుంది. ఈమాదిరి సంభాషణ ఎప్పుడు అధిక ఆకర్షవంతంగా వుంటుంది.

మధురంగా మాట్లాడటం :

"కాకేమి తన్ను దిట్టెనె? కోకిల తన కేమి ధనము కో కొమ్మనెనే? లోకము పగయగు ఒరుసని, వాకున, జుట్టమగు మధుర వాక్యమువలనన్." రసములలో మధురరసం అధిక మైనది. దీనివల్ల చిత్తము ప్రసన్నమవుతుంది. మాధుర్యమంటె ఎటువంటి కఠినమూ కానిది. పంచేంద్రియాలలో దేనికైనను మాధుర్యము కలుగవచ్చు. సుందరవస్తువును చూచినపుడు నేత్రములద్వారా అది రూపమాధుర్యమగును. శ్రవణ పేయ మైన మాటలు వింటూఉంటే శబ్దమాధుర్యమగును. ప్రసా దము, ఓజస్సు, మాధుర్యము కవితాగుణములకు మాధు ర్యము అన్నారు. జయదేవుని గీతగోవిందం కోకిలస్వరమే కనుక మాధుర్యము అన్నారు.

మాధుర్యం కావ్యంలోనే కాదు కావలసింది; లోక సంబంధంలోకూడా. సంభాషణలో మృదుమధురంగామాట్లా డటమే మాధుర్యం.

మాటలలో ఎంత ఆకర్షణశక్తివున్నదో సాధారణులు ఎరుగరు. న్యూటను ఆకర్షణశక్తికన్నా అధికంగా వున్నది. దేనిలో శబ్దాకర్షణశక్తి ఎంత అధికమో దాని ప్రభావం

అధికం. అది మానవులనే కాదు, పశుపక్ష్యాదులను కూడా ఆకర్షిస్తుంది.

కోకిల పంచమ స్వరాలాపన అందరిని ముగ్ధులను చేస్తుంది. దీనినిబట్టి మనం గ్రహించవలసిం దేమిటంటే మధురధ్వని అందరకు సుఖప్రదం. కనుక మధురమైన వాక్కులను మనం వాడాలి.

మధుర సంభాషణ అంటే మృదువైన వాక్కులే కాదు, మృదువైన భావంకూడా వుండాలి.

మాట్లాడేటప్పుడు ఒక మధురధ్వనితో మాట్లాడటం అవసరం. నీళ్ళు నవులుతూ మాట్లాడటం మంచిదికాదు. అది శ్రోతలలో ఉత్సాహం కలిగించదు. ఆ మాటకు ప్రభావం వుండదు. ఒకరు మాట్లాడే విషయం అంత పటుత్వం లేక పోయినా మాట్లాడే పద్ధతి బాగావుంటే శ్రోతలను బాగా ఆకర్షించుతుంది.

మధురంగా మాట్లాడుటకు ఉపమాన పరంపరలు అవసరంలేదు. స్పష్టము, మధురమైన ధ్వని అవసరం. సకిలించటం, తొస్సిగా మాట్లాడడం, మాటలు మింగటం, ముక్కుతో మాట్లాడటం ఇవేమీ మంచి ఫలితాన్ని ఇవ్వవు. మాట ప్రభావంగా వుండాలంటె ఉద్దేశం అవసరం. మధురంగా మాట్లాడాలనిఅంటే, తొందరగకాని, బిగ్గరగకాని, మరీ నెమ్మదిగగానీ మాట్లాడరాదు.

నోరు మంచిదైతే ఊరు మంచి దవుతుందన్నమాట మరువరాదు. మాటల ఇంపు సొంపు శబ్దంద్వారానే గాక చూపులవల్ల కంఠస్వరంవల్ల ప్రకటింపబడాలి. నీ హృదయ

మాధుర్యం నీ చూపులలోను కంఠస్వరంలోనూ వ్యక్తం కావాలి. సుప్రసన్న వచనం, సుస్వరం, ప్రేమామృత దృక్కులు మొదలగునవి నీమాట మాధుర్యానికి తోడు నీడగా ఉన్నప్పుడే రాణించేది.

"To acquire self-confidence and to win the confidence of your audience, it is necessary to develop a soft voice, a modest countinance and a simple manner of speaking. This method is especially valuable in those speeches in which one is trying to influence a fair minded judge. Energetic oratory is not always desirable : more favour is to be gained by a gentle demeanour, a soft voice and a simple style."

And a great psychologist has said, "There are three stages in our mental development; the first stage when we are simple through ignorance; the second stage when we become complex through the process of learning; and the third stage when we become simple again through knowledge."

"Men and women range themselves into three classes or orders of intelligence. You can tell the lowest class by their habit of taking about nothing else but persons; the next by the fact that their habit is always to talk about things; the highest by their preference for the discussion of ideas."

—BUCKLE.

సంభాషణ అంటే:

Conversation is a mutual meeting of minds says one writer, not a monologue but a reciprocial exchange of ideas, conversation is a give and take process.

సంభాషణోద్దేశము - అభిప్రాయ వినిమయము:

(exchange of thoughts)

ఆనందానుభవమే సంభాషణోద్దేశముకాదు. ఒకరి అభిప్రాయాలను మరియొకరు తెలిసికోవటమే సంభాషణ. మాట్లాడుతున్నవారినుండి ఏదో కొంత గ్రహించి జ్ఞానాన్ని అభివృద్ధి గాంచాలి. ఆ మాట్లాడే వారిని నిర్నిరోధంగా మాట్లాడ నివ్వాలి. లేకపోతే వా రభిప్రాయాలు, అభిరుచులు, అనుభవాలు మనకెట్లా తెలుస్తాయి?

ఇతరులకు అవకాశమివ్వకుండా ఒక్కరే మాట్లాడటము వాగుడు క్రింద లెక్క. అందులో అభిప్రాయ పరివర్తన కవకాశంలేదు. అభివృద్ధికి ఆధారంలేదు. అతడెంత గొప్పవాడైనా ఒక్కరే మాట్లాడటం, ఇతరులను నోరు మెదపనివ్వకుండా వినిపించటమనేది మంచిపద్ధతికాదు. ఆ మాట్లాడేవ్యక్తి "నాకు ఇందులో మంచి అనుభవమున్నది. నేను చెపుతాను విను" అనటం సంభాషణా పద్ధతికాదు. ఇద్దరు కలసి మాట్లాడేదే సంభాషణ. అదే సజీవ సంభాషణ.

ఇతరులతో సంభాషించేటప్పుడు, మన అభిప్రాయాలను పరులపై రుద్ద ప్రయత్నించటం మంచిదికాదు. మంచి సంభాషణ కర్తగా మనవలెనంటే, ఇతరుల అభిప్రాయాలను

సానుభూతితో వింటానికి, వాటి మంచి చెడ్డలను ఆలోచించ టానికి సంసిద్ధపడాలి. ఇది ముఖ్యంగా గమనించవలసిన విషయం.

ఇతరుల అభిప్రాయాలను తెలుసుకోవాలంటే చక్కగా వినటం నేర్చుకోవాలి. ఎంతమందిఉన్నా సరే అందరూ చెప్పేది ఆలకించాలి.

నలుగురుకూ తెలిసినదానిని ఒక మనిషి చెపుతూ ఉంటే అది పూర్తిగాక పూర్వమే తాను చెప్పాలని పెరపెర లాడుతారు కొందరు. అది తప్పు. తనవంతు వచ్చేవరకు జాగ్రత్తగ వింటూ అప్పుడు మాట్లాడటం మంచిది. ఇట్లా పదిమంది కలసి ఒక విషయం మాట్లాడటంవల్ల భిన్న దృక్పథాలు తెలుస్తవి.

ఈ విధంగా కృష్ణాపత్రిక సంపాదకులు ముట్నూరి కృష్ణారావుగారు ప్రతిరోజూ సాయంకాలం అక్కడకు వచ్చే వారితో సంభాషణ చేస్తూఉండేవారు. వారంతా చర్చిస్తూ ఉండేవారు.

ఒకనాడు గాంధిమహాత్ముడు ఇర్విన్‌ప్రభువు పిలుపు నందుకొని వెళ్లాలా ? అక్కర్లేదా ? అనేచర్చ సాగుతున్నది. కొంద రటూ, కొంద రిటూ మాట్లాడారు. చివరకు నార్ల వెంకటేశ్వరరావుగారు వచ్చేసరికి, 'చిన్నవాడైనా మన వెంకటేశ్వరరావు అభిప్రాయం తెలుసుకోతగింది' అన్నారు కృష్ణారావుగారు. అంతట నార్లవారు 'అయినను పోయి రావలయు హస్తినకున్' అన్నారు కదండి తిరుపతి కవులు

అన్నారు. మంచిమాట చెప్పారని ఆ వారపు కృష్ణాపత్రిక సంపాదకీయం ఆశీర్షికతోనే వ్రాశారు.

ఇట్లా సంభాషణలు జరిపి ఒకరి అభిప్రాయాలను ఒకరు మన్నించుకొనే పద్ధతిద్వారా ఎందరినో పెంచారు, తాము పెరిగారు కృష్ణారావు గారు.

సజీవ సంభాషణ అంటే అది.

సాధ్యమైనంతవరకు తన అభిప్రాయాన్ని సంగ్రహంగా చెప్పి ఇతరుల అభిప్రాయాలకు అవకాశమివ్వాలి.

## సంభాషణలోని కష్టాలు :

భావ వినిమయములో ఆలోచించవలసిన బాధ ఏమిటంటే కొందరు సంభాషణలో పాల్గొనటానికి సందేహిస్తారు. పదిమంది కలిసి మాట్లాడుతున్నపుడు, విందులలోనూ, వినోదాలలోనూ కలసినపుడు మౌనం వహిస్తారు. అతిగా మాట్లాడటం ఎంత అనర్థదాయకమో ఏమీ మాట్లాడకపోవటమూ అంతే. ప్రతివారూ పాల్గొన్నపుడే దేనికైనా అందచందాలు వచ్చేది. మాట్లాడకుండా మూగవానివలె వున్నవారివంక మిగతావారంతా చూస్తూ ఉంటారు. అతడొకవిధంగా అవమానం పొందినట్లే లెక్క.

కొంతమంది మాట్లాడకుండా ఉండటం శక్తిలేక కాదు. సిగ్గు. సభాపిరికి. ఇంతమాత్రంచేత ఊరుకోరాదు. ఈ బిడియాన్ని పోగొట్టుకొనుటకు ప్రయత్నం చేయాలి. బాగా మాట్లాడేవారు ఆ బిడియపడేవారిని మాట్లాడేటట్లు చేయటానికి సర్వవిధాల సానుభూతితో ప్రయత్నించటం అవసరం. అతనికి అందుబాటులో ఉండే విషయాన్ని అందు

కొని అతనితో సంభాషించటానికి ప్రయత్నించాలి. ఆ మాదిరిగ అందరిని రంగములో దింపి ఆనందించాలి తెలిసిన వారు.

మంచి సంభాషణకర్త ఎప్పుడూ ఇతరులకు తెలియని విషయాలను మాట్లాడ ప్రయత్నించడు. తన గొప్పదనాన్ని ప్రదర్శించేవారు మంచి సంభాషణకర్త కానే కాడు. అందరూ పాల్గొనటంలోనే సంభాషణ సొగసున్నది. ఎదుటి వారి ప్రశంస పొందకపోతే అరణ్యరోదన.

మానవులు కలసి మెలసి మాట్లాడుకొన్నందువల్లనే ఒకరి నొకరు అర్థంచేసుకొంటారు. తద్వారా మైత్రి కలుగుతుంది.

సంభాషణలో నిన్ను గురించే నీవు అధికంగా మాట్లాడరాదు. అందుచేతనే, 'ఆత్మస్తుతి, పరనింద పనికిరా' దన్నారు. అసలు అధికంగా మాట్లాడటమే తప్పు. అది అనేక అనర్థాలకు ఆలవాలం.

తక్కువగా మాట్లాడు, ఎక్కువగా విను. ఇందులో ఎక్కువ లాభాలున్నాయి. నీవు మాట్లాడినందున నీకు వచ్చేదిలేదు. విన్నందువలన నీకు అనేక విషయాలు తెలియవచ్చు.

అదీగాక ప్రతివారు మాట్లాడ తలుస్తారు. నీవు ఇతరుల దృష్టిలో మంచివాడవని అనిపించుకోవాలంటే శ్రద్ధగా ఇతరులు చెప్పేది విను.

మంచి సంభాషణకర్త చక్కగా వినేవాడే.

సంభాషణలో వాగ్వివాదాలు పనికిరావు. అవి చివరకు తగాదాలు క్రిందకు వస్తవి. ఎదటివారి అభిప్రాయాల్ని ఖండించటానికి మనం ప్రయత్నిస్తే, తన అభిప్రాయాల్ని సమర్థించుకోవటానికి అతడు ప్రయత్నిస్తాడు. అశక్తుడైనపుడు "శేషం కోపేన పూరయేత్" అన్నట్లు ప్రవర్తిస్తాడు. 'Debate is the death of conversation' - Emil Luting.

విడువవలసిన దోషాలు:-

సంభాషణలో దురుసుదనం పనికిరాదు. మాట్లాడేటప్పుడు ఎదటివారిని "నీవు వట్టి శుంఠవు. నీకేమీ తెలియదు. నీవు మాట్లాడేదంతా వట్టి చెత్త" అని నీచపరచరాదు. ఇట్లా మాట్లాడేవారంతా సరసులుగారు. ఇతరుల అభిప్రాయాలను మన్నించనివాడు సంస్కారి కాడు. అన్నీ అందరికీ తెలియవు. సర్వమూ తెలిసినవారూ లేరు. ఏమీ తెలియనివారూ లేరు అని గుర్తించటం అవసరం.

సోక్రటీసు చాలా గొప్పవాడు. ఆయన అన్నమాట ఆలకించదగినది. "నాకేమీ తెలియదని నాకు తెలుసు, ఇతరులకు ఆ సంగతి తెలియదు" నిండుకుండ తొణకదంటారు ఇదే.

నేర్పుగా మాట్లాడే మనిషి శ్రోత సరిగా వింటున్నాడో లేదో చూస్తుంటాడు. అతనికి శ్రద్ధ లేకపోతే ఆసంగతి విడిచిపెడతాడు.

సంభాషణ అనేది ఒక ఆటగా భావించాలి. రెండవవాడు ఆడకపోతే ఒక్కడే ఆడేదేమిటి?

ఇతరులతో మాట్లాడేటప్పుడు నీ ఇంటి విషయాలు గాని, పరుల గృహకల్లోలాలుగాని మాట్లాడరాదు. రాజకీయ నాయకులనుగురించి ప్రముఖులను గురించి అమర్యాదగ మాట్లాడరాదు.

ప్రతివారిని గురించి సానుభూతితో మాట్లాడటం మంచిది. మర్యాద ఇచ్చి మర్యాద తెచ్చుకోమన్నారు. ఇది నీకూ ఇతరులకుకూడా మంచేఅని గ్రహించాలి. ఇది అందరికి అందుబాటులోని విషయం. ఈ మాదిరిగా ప్రవర్తిస్తే లోకం ఎంతో సుఖప్రదంగా ఉంటుంది.

## సంభాషణ రాణించే మార్గాలు :

మంచి సంభాషణలో ముఖ్యాంశం, ఇద్దరుగాని ముగ్గురుగాని మాట్లాడుతున్నప్పుడు ఒక విషయాన్నిగురించే మాట్లాడరాదు. సంభాషణ సజీవంగా ఉండాలంటే ఒక దానిమీదనుంచి మరొకదానిమీదికి సహజంగా పోవాలి. ఆ విషయాలు అక్కడున్న వారందరికి తెలిసేవిగా వుండాలి. వారి అంతస్థు విద్యాపరిణతి, ఎట్లాఉన్నా ఆ విషయాలు సర్వసామాన్యంగా ఉన్నప్పుడే అవి రాణిస్తవి.

ఆ సంభాషణలో పాల్గొనేవారందరికి ఆమోదప్రదం ఆనందకరంగాను ఉండాలి. ఏవిషయాన్నైనా చక్కగా మాట్లాడగల అదృష్టవంతులు కొందరే ఉంటారు. వారితో మాట్లాడటం ఆనందం, అదృష్టం.

కొంద రేదో కాలక్షేపం చేయాలని తలుస్తారు. మాటలవల్ల మంచి కలగదని చూస్తారు. వారు పైపై సంగతులు మాట్లాడ తలుస్తారు.

ఏదైనా అసభ్యకరమైన సంగతిగాని అనిష్టకరమైన మాటలుగాని వస్తే "అది వదిలిపెడుదువు, ఏదైనా మంచి మాట చెప్పు" అని మార్చాలి.

వినేవారిని సంతోషపెట్టాలని హాస్యరస కథలు చెప్పటం సంభాషణ కాదు. ఏవైనా కొత్త సంగతులు చెప్పటం సంభాషణ.

అందరికీ ఆమోదకరమైనదానిని గురించి సంభాషించడం మంచిది.

నూతన వ్యక్తులను కలుసుకున్నప్పుడు సంభాషణ సాధారణంగా ప్రశ్నరూపంగానే ఉంటుంది. మీ దేవూరు? మీ పేరేమిటి? ఈ మాదిరిగా ఉభయులు మాట్లాడుకున్నప్పుడు అనుకూలత కలిగితే ఆ పరిచయం స్నేహంకింద మారుతుంది.

## దేన్ని గురించి సంభాషించాలి :

తెలిసిన మనిషి కనపడగానే కుశలప్రశ్న వేస్తాము. తర్వాత ఏ విషయాన్ని మాట్లాడాలా అని ఆలోచించవలసి వస్తుంది. అవతల మనిషి అభిరుచిస్థాయినిబట్టి పలకరించాలి. అతడు గ్రంథ పఠనాభిలాషి అయితే ఈ మధ్య ఏదైనా మంచి పుస్తకం చదివారా అనవచ్చు.

నిన్నడిగితే చదివిన పుస్తకాల గురించి నీ అభిప్రాయాలు వివరంగా చెప్పరాదు. ఇది మంచి పుస్తకం; ఇది చెడ్డది-అని చెప్పరాదు. అభిరుచుల భేదం. ఇది నాకు బాగుంది-అనాలి. అది నాకు నచ్చలేదు-అనాలి. అసలు అట్లా అంటంకూడా మంచిదికాదు. నీ అభిప్రాయం అతనిపై పనిచేస్తుంది.

కొందరు మతవిషయాలు, రాజకీయాలు మాట్లాడరాదంటారు. మతవిషయాలనుగురించి తీవ్రమైన భిన్నాభిప్రాయా లుండటం సహజం. అవి మామూలేవి కాదు. ఎవరికి వారు తమ నమ్మకాలే మంచివనుకుంటారు. అదీకాక మత విషయం వ్యక్తిసంబంధం.

రాజకీయాలనుగురించి తప్పకుండా మాట్లాడాలి. ఈ కాలంలో అవే ప్రధానం. రాజకీయాలు దేశానికి సంబంధించినవి. వాటిల్లో భిన్నాభిప్రాయా లుండటం సహజం. అభిప్రాయాలను గురించి వినటం చర్చించటం అవసరం. దేశ పురోభివృద్ధి వాటిమీదనే ఆధారపడివుంది.

భిన్నాభిప్రాయాలుగల వారితో మాట్లాడకపోతే మంచి చెడ్డలు తెలిసేది ఎట్లా? తీవ్రమైన వివాదాలలో దిగరాదు. తన అభిప్రాయాన్ని నెగ్గించుకోవాలని ప్రయత్నించరాదు.

మానవులు రూపురేఖలలో ఎట్లా భిన్నంగాఉంటారో అట్లాగే అభిప్రాయాలలోను భిన్నంగాఉంటారు. అభిప్రాయ భేదం ఉన్నంతమాత్రాన ఒకరినొకరు హేళన చేసుకోవటం, మాటి ముసుచుకోవటం మంచిదికాదు.

ఎదుటివారి అభిప్రాయాన్ని విన్నప్పుడే మంచి చెడ్డలు తెలిసేది.

స్త్రీ పురుషుల సంభాషణ :

పురుషులు తరచుగ సంతోషంతో మాట్లాడుకుంటారు. అట్లాగే స్త్రీలు ఇతరస్త్రీలతో సంతోషంగా మాట్లాడుకుంటారు.

పురుషులకు స్త్రీలకు కులాసాగా మాట్లాడుకోవటానికి ప్రత్యేకవిషయాలున్నాయి. వ్యవసాయపనులగురించి, ఆటపాటలగురించి పురుషులు; పిల్లా జెల్లనుగురించి, ఇల్లువాకిళ్ళ గురించి స్త్రీలు మాట్లాడుకుంటారు.

ప్రపంచమంతటా స్త్రీలకు సర్వసాధారణమైన విషయం దుస్తులు. సమయాసమయాలు లేకుండా కనబడగానే మాట్లాడేది వాటినిగురించే. పురుషులకు ప్రపంచమంతటా ఆకర్షించే విషయాలు శూన్యం. స్త్రీ లెంతటి అదృష్టవంతురాండ్రు!

స్త్రీ పురుషు లున్నచోట ఎట్లా మాట్లాడాలన్నది క్లిష్ట సమస్య. వారు కలసి మాట్లాడటంలో ఆనందం అనుభవించటం కష్టమని కొందరంటారు. కాని ఆలోచిస్తే అది సబబుగా తోచదు. స్త్రీపురుషులు కలసి మాట్లాడుకోవటంలో మహదానందం ఉన్నది. దానిలో కొంత ఆకర్షణ, వినోదం లేకపోలేదు.

పురుషులు సహజంగా తాము చెప్పేసంగతి తమకు బాగా తెలుసని విశ్వాసం కలవారు. వారు వాద

చతురులుకూడా. వారికి ఒక అహంభావంకూడా ఉంటుంది. తాము చెప్పేది రైటని, ఇతరులు చెప్పబోతే వారికేమీ తెలియదని అనేస్తారు.

స్త్రీలు సహజంగా లజ్జ బిడియంకలవారు. వారు తమ అభిప్రాయాలను వెల్లడించటంలో వెనుకాడతారు. పురుషులతో వాదిస్తానికి సంశయిస్తారు.

ఆడపిల్లలు యువకులను కదలించి వారి వారి కార్య కలాపాలు వినగోరుతారని అంటారు. అది పాత మాట. పురుషులు స్త్రీల నోటిమాట వింటానికే సదా ఉబలాట పడతారు. స్త్రీ అనే పేరే మధురం అన్నాడు పురుషుడు. అటువంటప్పుడు ఆమె మాటలకు చెవి కోసుకుంటాడంటే అతిశయోక్తి ఏమున్నది? పురుషులు స్త్రీలతో మాట్లాడే టప్పుడు కొంచెం జాగ్రత్తగా మాట్లాడాలి. స్థనశల్య పరీక్ష, అజాగళ స్థనం మొదలగు మాటలేగాక, వారు నొచ్చు కొనేటట్లు మాట్లాడరాదు.

అలాగే స్త్రీలు పురుషులపై సవారీ చేయరాదు.

ఉభయులకు అనుకూలమైన విషయాలమీద సంభాషణ చేయటం మంచిది ఆ సంభాషణవల్ల వినోదం విజ్ఞానం పొందాలి, అవి సంగీత సాహిత్యాలుగాని సాంఘిక ఆర్థిక రాజకీయవిషయాలుగాని.

స్త్రీ పురుషులు కలసి మాట్లాడటంలోగల చిక్కు ఏమిటంటే సాధారణంగా హృదయం విప్పి మాట్లాడుకోరు. మగవారు గంభీర హృదయులు. స్త్రీలు మాట్లాడుతూంటే

చాలామంది మగవారు వింటూ ఉంటారు. అది సంభాషణ అనిపించుకోదు.

స్త్రీలు అట్లాకాదు. పురుషులు మాట్లాడుతుంటే మందహాసం చేయటమో, సంతోషం వెలిబుచ్చటమో ఏదో చేస్తూ ఉంటారు. స్త్రీలుగాని ఆడపిల్లలుగాని మాట్లాడటం ఆరంభించారంటే గబగబ మాట్లాడుతారు. అదంతా ఆలోచనలేకుండా బిడియంచేత కలిగిందే. క్రమంగా వారు కూడా కొంతకాలానికి ఆలోచించే సంభాషించటానికి ప్రయత్నిస్తారు.

స్త్రీ పురుషులు మాట్లాడుకోవటంలో ఒక చిక్కు ఉంది. పురుషులు సహజంగా తమ కిష్టమైన ఆటపాటలను గురించి ఆరంభిస్తే స్త్రీలు తమ పిల్లామేకనుగురించి చెప్పసాగుతారు. ఇదంతా అందరకూ ఆమోదంకాదు. కొంచెం వయసు మిగిలినవారు కుటుంబవిషయాలంటే ఇష్టపడతారు.

స్త్రీలలో మరొకసంగతేమిటంటే ఏమన్నా పిల్లాలా? అని తప్పకుండా అడుగుతారు. అది పూర్వాచార పరాయణులకు ఇష్టమేకాని నవనాగరికులకు అంత ఇష్టంగాఉండదు. ఒకవేళ పిల్లలు లేకపోతే ఆమె చాలా నొచ్చుకోవచ్చు. ఏమైనా స్త్రీలు విశేషంగా తమపిల్లలసంగతి చెప్పకోకుండా వుండటం మంచిది. ఎందుకంటే, ప్రతివారూ తమ పిల్లల సంగతి చెప్పతలుస్తారు. అందుచేత సోది వింటానికి ఇష్టం ఉండదు.

స్త్రీ పురుషులు, సంభాషణలో తమ భావాలను వెలిబుచ్చుకోవటానికి అవకాశంగా భావించుకోవాలి. గృహ

సంబంధాలు మానాలి స్త్రీలు. ఉభయులు సానుభూతితో ఒకరి అభిప్రాయాలు ఒకరు గ్రహించటానికి ప్రయత్నిం చాలి.

సంభాషణలో అందరికి ఆమోదప్రదంగా ఉండే విషయాన్ని మాట్లాడాలనేది ప్రథమంగా మనసులో నుంచు కోవాలి. సంభాషణవల్ల ఒకరి అభిప్రాయాన్ని ఒకరు గ్రహించి, ఒకరినొకరిని అర్థంచేసుకొనేటట్లుండాలి. అన్యథా భావించరాదు.

స్త్రీ పురుషులుకలసి మాట్లాడుతూ ఉంటే మాధుర్యం ఉట్టిపడేట ట్లుండాలి. అది ఒక వింతశోభ, ఉత్సాహము ఆనందానుభవంగా ఉండాలి.

చిన్నారావు (రేమెళ్ళ) కృష్ణాబాయి (తుమ్మల) హేమ (తాతినేని) నేనూ కలసి సంభాషణ చేస్తున్నప్పుడు కాలం సంగతి తెలియనే తెలియలేదు.

కాకినాడలో మధురంగా గడిపాము. అదొక మధుర స్మృతి.

ఒకరి నొకరు అర్థంచేసుకొని పరస్పర మైత్రికలిగి పరస్పరం పెరిగాము.

మాటవల్ల మనస్సు కలియాలి.

నాకు తెలిసిన స్త్రీలల్లో రామతుల భారతీదేవి, ఇల్లిందల సరస్వతీదేవి, అత్తిలి స్వరాజ్యలక్ష్మి కృష్ణాబాయి గారలు ఉత్తమ సంస్కారులుగ కన్పిస్తారు. వారి ఉనికే ఉత్తమ సంస్కారం కలిగిస్తుంది. వారితో సంభాషించటం సంగతి వేరే చెప్పనక్కరలేదు.

## స్త్రీల సంభాషణ:

స్త్రీలు తమలో తాము మాట్లాడుకొనేటప్పుడు సాధారణంగా దిగువస్థాయిలోనే మాట్లాడుకుంటారని విచారకరంగా చెప్పకతప్పదు. అసలు వారు స్వవిషయాలు చెప్పుకొనే పద్ధతికి అలవాటు పడ్డారు. బజారులోగాని, బస్సులోగాని ఎక్కడైనా స్త్రీలు మాట్లాడుతుంటే వినండి, తరచుగా వినబడేదేమంటే: "ఆమెతో నేనామాటన్నాను" "తర్వాత ఆమె నాతో అన్నది" "ఆమె అన్నది – నేను అన్నాను" ఇదే ధోరణి. ఇదంతా ఒక కథగా తోస్తుంది. తమస్థాయిలో వారు చెపుతారు. సంభాషించరు. ఇదంతా బాతాఖాని. ఇది సంభాషణ కాదు. ఇటువంటి మాటలవల్ల స్త్రీలు పొందేదేమీ లేదు. ఇట్లా చెప్పిందే చెప్పటం ఒకపద్ధతి. మరొకటి, పిల్లలనుగురించి చీరలనుగురించి అధికం, అనంతరం కొద్దిగా గృహకృత్యాలను గురించి.

సహజంగా స్త్రీలు మాట్లాడేదానిలో తెలుసుకొనేటందుకు ఆనందించేటందుకు ఏమీ ఉండదు. ఉబుసుపోకకు చెప్పుకొనే కబుర్లు అవి. మనదృష్టిలో ఇవిఅన్నీ అల్పమే. కానీ స్త్రీలదృష్టిలో వీటికంటె గొప్పసంగతులు లేవని అనుకోవాలి. వారు మంచి మంచి చీరలు జాకెట్లు ధరించారంటే వారేకాదు సంతోషించేది, లోకమంతా శోభాయమానంగా ఉంటుంది. సుందర వస్తువులనుచూచి సౌందర్యారాధకులు ఆనందిస్తారు.

అట్లాగే వారు తమ ఇల్లువాకిలిని గురించి, అన్నపానీయాలను గురించి గృహోపకరణాలను గురించి, మాట్లాడ

తారంటే ఆశ్చర్యమేమిటి? స్త్రీ ఘర్కీరాణి, గృహలక్ష్మి గృహదేవత. అందుచేతనే ఇల్లుచూచి ఇల్లాలునుచూడ మన్నారు. ఇల్లాలే ఇల్లు. 'నగృహమ్ గృహమిత్యాహు గృహిణీ గృహముచ్యతే.'

ఆమె తమ పిల్లలను గురించి మాట్లాడుతుంది. వారి విద్యా బుద్ధులను గురించి ముచ్చటిస్తుంది. అంటే ఇందులో తప్పేమున్నది! ఆమె నవమాసాలు మోసి కన్నది. స్త్రీకి సంతానమందుండే ప్రేమకంటే అధికం మరొకటి లేదు. పిల్లలకై తల్లి సర్వస్వమూ త్యజిస్తుంది. గృహసంబంధమైన విషయాలు మాట్లాడుకోవటంలో వారు కొందరికి సలహాలిస్తారు. మరికొందరి సలహాలు పొందుతారు. ఈవిషయంలో సిగ్గుపడవలసిందేమీ లేదు. అయినప్పటికీ ఇదంతా సంభాషణ అనిపించుకోదు. సంభాషణ నిజంగా నవ్యభావోదయం ద్వారా సంతోషం కలిగించాలి. గృహసంబంధమైన మాటలు ఆపని చేయలేవు. సంభాషణానంతరం "సంభాషణ చాలా బాగున్నది, సంతోషప్రదమైనది" అనే భావాన్ని కలిగించాలి.

కొందరు పురుషులు స్త్రీలను చాలా చెడ్డగా చిత్రించారు. ఆడదాని నోటిలో నూవుగింజ నానదని, ఆడబుద్ధి అపరబుద్ధని, ఆడది గాడిదని, స్త్రీబుద్ధి ప్రళయాంతకరి, కోడిపుంజూ ఒక పిట్టేనా, ఆడదీ ఒక మనిషేనా అని. ఇదంతా ఇప్పుడు మారుతున్నందుకు సంతోషం.

స్త్రీలు సాంఘిక ఆర్థిక రాజకీయ విషయాలనుగురించి మాట్లాడుకోరని ఆక్షేపించటం ఎందుకు? అందులో వారికి

అవకాశంలేకుండా చేశారు మొగ మహారాజులు. ఇల్లూ పిల్లలు, భర్త ఇదే వారి ప్రపంచమన్నట్లు చేశారు. అటు వంటప్పుడు ఎవరో కొందరికి తప్ప అందరికీ ఆలోచన అదే.

ఈ సంగతులే మనం ప్రమదావనంలోనూ (ఆంధ్ర ప్రభ వారపత్రిక) వనితాలోకంలోనూ (ఆంధ్రవారపత్రిక) చూస్తూవుంటాము. స్త్రీల మన స్తత్వాన్ని బాగాగుర్తించింది చిన్నదైనా మాలతీ చందూర్. ఆమె ఈనాడు స్త్రీలకు స్నేహితురాలు, తత్వవేత్త, గురువు (Friend, philospher and guide) అది ఒక అదృష్టము. స్త్రీలు ఆంధ్రప్రభను కథలకంటే ప్రమదావనంకొరకే తెప్పిస్తారంటే అతిశయోక్తి కాదు.

స్త్రీలు గృహవిషయాలలో పడి విసుగుపుట్టి కాస్త తీరిక కల్గగానే కులాసా పొందగోరుతారు. అప్పుడు వారు మరొకరిని కలుసుకొన్నప్పుడు పిచ్చాపాటి మాట్లాడు కోవ టంలో నూతన సంగతులు తెలుసుకుంటూ ఉంటారు. చదువు నేర్చినవారు, విద్యార్థినులు పుస్తకాలను గురించీ రాజ కీయాలనుగురించి, ఈనాటి సమస్యలనుగురించి మాట్లాడు కొంటారు. సహజంగా వారు వివాహాలనుగురించి పిల్లలను గురించీ చర్చించుకొంటారు. అప్పుడు అమ్మా! ఈనాడు మంచి సంభాషణ జరిగింది. అదృష్టవంతులము అనుకొం టారు. ఈనాడు కాస్త తెలిసిన స్త్రీలు మాట్లాడుకోవలసిన సంగతులు అనేక మున్నాయి. రేడియో కార్యక్రమాలు,

సినిమాలు, సాంఘిక సంక్షేమ కార్యక్రమాలు, మహిళా సంఘాలు, స్థానిక సంస్థలు మొదలగునవి ఎన్నో ఉన్నవి.

స్త్రీలలో విద్యావ్యాప్తి ఆర్థికస్తోమతు మొదలగు అవకాశాలు లభిస్తే పురుషులవలే వారికి అభిరుచి కలుగుతుంది. నేడు యువతులు కొందరు నూతన అవకాశాలు పొంది గౌరవాలు పొందుతున్నారు.

స్త్రీలుకూడా నేటి పరిస్థితి గమనించి పిల్లలే ప్రపంచం ఇల్లే స్వర్గమని, కూపస్థ మండూకంలాగా గాక, ప్రపంచ ధోరణిని గ్రహించాలి. ఇతరులతో మాట్లాడేటప్పుడు తమ గొడవలను మాని, లోక వ్యవహారాలను మాట్లాడాలి. సంభాషణవలన ప్రయోజనాన్ని పొందాలి.

కనుక వారుకూడా సంభాషణా చాతుర్యాన్ని అలవరచు కోవాలి.

నేడు మనం తానీషాలనాడువలె లేము. రాజులు, రాణులూ పోయారు. బ్రాహ్మణులూ శూద్రులూ అనే భేధం పోయింది. అంటరానితనం అడుగంటింది. ఇంతే కాదు. ప్రపంచమంతటా ప్రజాస్వామ్యము ఏర్పడింది. స్త్రీ పురుషులు సమానమన్నమాట పాటించ బడుతుంది.

స్త్రీ పెరగాలి - పెంచాలి.

ఆ ప న్ను ల తో:

మానవుడు సంఘజీవి. ఈ లోకం కేవలం ఆనంద ప్రదమైనది కాదు. సుఖదుఃఖాలతో కూడుకున్నది. కనుక

మనం తరచు రోగులను చూచుటకో బిడ్డనో భర్తనో భార్యనో పోగొట్టుకున్న వారిని పరామర్శించుటకో వెళ్ళ వలసి వస్తుంది. అటువంటప్పుడు వారితో ఎట్లా మాట్లాడాలి- అన్నది తేలికైన సంగతి కాదు. ఆపదలోవున్న మన బంధు మిత్రుల సానుభూతికై అనగా వారి దుఃఖ నివారణకై వెళతాం. వారి అనారోగ్యాన్ని గురించిగాని, ఆపదను గురించిగాని మాట్లాడటం తెలియదు. వారిని ఎట్లా ఓదా ర్చాలో బోధపడదు.

ఒక దీర్ఘరోగి ఆస్పత్రిలోఉండి కోలుకొనే సమ యంలో మనం చూచినట్లయితే అతనికి ప్రయోజనం కలుగు తుందని తలుస్తాం. మనం ఆ రోగియెడల సానుభూతితోనే వెళతాం. అతనికి ఏమికావాలో కనుక్కొన కోరుతాం. పుస్తకాలు కావాలా, పత్రికలు కావాలా, ఉత్తరాలు వ్రాసిపెట్టాలా-అని అడగటం మంచిది.

కొందరు వచ్చినవారు వచ్చినట్లుండక రోగి స్థితిగతులు గమనించకుండా తమ సొద చెప్పుకొని ఆరోగిని విసిగించేవా రుంటారు. అసలు రోగులకు ఇటువంటి విషయాలంటే చిరాకు. వారు అసలు బాధలో ఉన్నారు. వారిని మరింత బాధ పెట్టటమా? మనం ఉన్న కాసేపైనా వారిని బాధ మరచేటట్లు చెయ్యాలి.

రోగులు తరచు తమ కష్టాలు, తమ బాధలు చెప్పు కోవటం సహజం. ఏమన్నా బాధా? అని అడిగితే వారికి బాధేమైనా ఉంటే దాన్నిగురించి చెపుతారు. కనుక జబ్బుగా ఉన్నవారితో మాట్లాడటానికి వెళ్ళినప్పుడు ప్రథ

మంగా వారి ఆరోగ్యాన్ని గురించి, వారి బాధను గురించి మాట్లాడాలి.

రోగులు పరాయిచోట ఉన్నప్పుడు వారు సహజంగా తమ కుటుంబాన్ని గురించి, స్నేహితులగురించి విన కోర తారు. సభలు, సమావేశాలు, విందులూ, వినోదాలూ మొదలైనవాటిని గురించికూడా తెలుసుకోన కుతూహల పడతారు.

దీర్ఘరోగులు తరచు మిత్రులను చూడగోరుతారు. వచ్చినవారు వారిని ఎట్లా సంతోష పెట్టాలి అను సంగతిని ఆలోచించాలి. వారికి ఇష్టమైన మాటలను మాట్లాడాలి. వారిఅభిరుచినిబట్టి మాట్లాడాలి. వారికి కులాసా కలిగించాలి.
"Discreation of speech is more than eloquence; and to speak agreebly to him with whom we deal is more than to speak in good words or in good order" —Bacon.

రోగివద్ద దుఃఖకరమైన విషయాలు, అనిష్టకరమైన సంగతులు మాట్లాడరాదు. ప్రపంచంలోవున్న దుఃఖాలను గురించి అతని ఎదుట ఎత్తరాదు. దుఃఖంలో కొట్టుమిట్టాడు వారితో ఇంకా దుఃఖాలను గురించి మాట్లాడటం అవివేకం.

రోగి తనవల్ల కాస్త సుఖసంతోషాలు పొందేటట్లు భావించి మాట్లాడాలి.

శోకంలో వున్నవారి సందర్భంలోకూడా ఈ సంగ తినే పాటించాలి. ఆపదలో వున్నవారిని చూడటం మన ప్రధాన ధర్మంగా భావించి, ప్రథమంగా చూడాలి. వారి

శోకావస్థను గురించి మనం మాట్లాడటం మంచిది కాదు. దుఃఖంలో వున్నవారిని గురించి మరింత దుఃఖపెట్టటం అవుతుంది. మనం వారి శోకభారాన్ని గమనించే వచ్చామని వారికి తెలుసు. ఆ బాధ భరించలేక వారే మాట్లాడతారు ఇతరులతో చెప్పుకోవటంవల్ల శోకభారం తగ్గుతుంది. ఆపని వారే చేస్తారు. మన ఉనికే అక్కడ అవసరం; మనమాట కాదు. అందుచేతనే పూర్వకాలంలో ఎవరైనా పోతే పెద్దలు వారింట్లో దుఃఖోపశమనం కలిగేవరకు ఉండేవారు.

తన తండ్రి మోతీలాల్ నెహ్రూ అస్తమించినపుడు గాంధీమహాత్ముడుకి తమ గృహంలో వుండుట తమకెంతో దుఃఖోపశమనం కలిగించిందని జవహరలాల్ తనఆత్మకథలో చెప్పుకొన్నాడు.

"Speak but little and well if you would be esteemed a man of merit" —Trench.

మన శక్తియుక్తులను బట్టి ఏదో లోకపు సంగతులను చెప్పి వారి దుఃఖాలను మరపించటానికి మరొకవైపుకు మార్చాలి.

కాని అట్లా చేయరు.

ఒక వృద్ధుని కుమార్తె పోయిందనుకొండి.

"ఒకాయన మీరు చాలా దురదృష్ట వంతులండీ" అంటాడు.

మరొకాయన "మీరు కాళ్ళు కడుక్కొని కూర్చున్నారు. మీకీ సమయంలో దుఃఖంపెట్టి పోయింద"ని అంటాడు.

"మీరు అన్నీ తెలిసినవారు, మీరు శోకించరాదు" అంటారు ఇంకొకరు.

ఇవన్నీ దుఃఖాన్ని పెంచేవే. వారు వచ్చింది దుఃఖోపశమనం చేయటానికి. వచ్చినదానికి భిన్నంగా మాట్లాడటం జరుగుతుంది. తమ ఉనికి వల్లనే దుఃఖోపశమనానికి దోహదం కలుగచేయాలి. మాటలవల్ల కలగదు.

కాల పురుషుడే ఈ గాయాన్ని మార్చాలి. మానవులు చేయలేరు. మరుపుఅనే మహాభాగ్యాన్ని ఈశ్వరుడు మనకు ప్రసాదించాడు. అందువల్లనే మనం జీవించ కల్గుతున్నాం.

గమనించవలసింది ఏమిటంటే, అనారోగ్యంగా ఉండనీ, ఆపదలో ఉండనీ వారిని చూడటానికి వెళ్ళినప్పుడు మన మాటలు వారి దుఃఖాన్ని మరపించి కొంచెమైనా భారం తగ్గి కాస్త ఊపిరి పీల్చుకొనేటట్లు చెయ్యాలి.

మనం మాట్లాడి వెళ్ళినతర్వాత ఈ వ్యక్తివల్ల కాస్త శాంతి చేకూరింది-అనుకొనేట్లుండాలి.

### యాదృచ్ఛిక సంభాషణ :

తెలియనివారితో మాట్లాడకూడదని నేటి యువజనులలో ఒక భావం పెంపొందింది. కాని మన ప్రాచీనులు ఇందుకు భిన్నంగా ఉండిరి. వారు అందరిని ఆప్యాయతతోనే పలకరించేవారు. పలకరించటమే కాదు; వారి పుట్టుపూర్వోత్తరాలన్నీ తెలుసుకొనేవారు.

ఆంగ్లేయుల సంప్రదాయం దీనికిభిన్నం. ఒకరైలులో ఇద్దరు ఆంగ్లేయులు కలిసి ప్రయాణం చేస్తూఉన్నా, అపరి

చితులు మాట్లాడుకోరు. మూడోవ్యక్తి ఎవరో వచ్చి వారి నిద్దరిని పరిచయం చేసినప్పుడే వారు పలకరించుకొనేది.

రైళ్ళల్లోనూ, బస్సులలోనూ, ప్రయాణం చేసే టప్పుడు పుస్తకమో, పత్రికో పుచ్చుకొని కాలక్షేపం చేయటం సహజం. కొంతసేపు చదవగా విసుగుపుడుతుంది. అంతట ప్రక్కనున్నవారిని పలకరించటం తటస్థిస్తుంది. మీ పేరేమిటి? ఎక్కడనుండి వస్తున్నారు? ఇట్లా ప్రశ్న పరంపరలు సాగుతవి. పట్టణపువారైతే పల్లెటూరి వారిని వారి ఆచార విచారాలను గురించి, వారి కష్టసుఖాలను గురించి, తెలుసుకొన ప్రయత్నిస్తారు.

అట్లాగే ఒకరు మరొకరినికాని అదే గొడవగా ప్రశ్నించే మనిషిని చూస్తే కష్టంగానే ఉంటుంది. అవతల వారి అభిప్రాయాన్ని గమనించి మాట్లాడాలి.

ప్రపంచం ఒక నాటకరంగం. ఇందులో పాత్రలను పరికించాలంటే ప్రయాణాల్లోనే చూడాలి. భిన్న భిన్న దృక్పథాలు కలవారిని కలుసుకుంటానికి అవకాశం చిక్కుతుంది. దేశాటనమువల్ల మంచి అనుభవం కలుగుతుంది. రైల్లోకూడా మన ముక్కూ ముఖము ఎరుగనివారు మన అవసరాలని గుర్తించి సాయపడుతుంటే, వారియెడల మనకు ఎంతో ప్రేమ కలుగుతుంది. తర్వాత వారి ఊరూ పేరూ తెలుసుకొని వారిని బంధువులుగా భావిస్తాము. ఆ నూతన స్నేహితులు కొందరు మన రక్తబంధువుల కంటే ప్రేమాస్పదు లవుతారు.

మరికొందరు ఈ కాలగమనాన్ని గమనించక మడీ దడీ అంటూ కూపస్థ మండూకంలాగా ముడుచుకొని కూర్చొంటారు. మాట్లాడితే నోటి ముత్యాలు రాలిపోతా యనుకొంటారు.

రైలు ప్రయాణాల్లో రాక్షసులను దేవతలను చూడగలం.

ఇంకా ఈ ప్రయాణాల్లో ఇతర ప్రాంతీయులను కలుసుకొని ఆ దేశాచారాలను, అక్కడి పాడిపంటలను తెలుసుకొని తద్వారా లోకానుభవాన్ని గాంచగలం.

రైళ్ళల్లోను, బస్సుల్లోనేగాక, తీర్థయాత్రల్లో కూడా సంభాషణద్వారా మనం నూతన మిత్రులను పొందటానికి అవకాశం కలుగుతుంది.

**పిన్నా పెద్దల సంభాషణ :**

సాధారణంగా పెద్దలతో మాట్లాడటానికి పిన్నలు శ్రద్ధవహించరు. కుటుంబాల్లో అయితే పిన్నలు పెద్దలతో మాట్లాడటం తప్పనిసరిఅవుతుంది. పెద్దలకు తమకు అభిరుచుల చేత,అంతరాలచేతగల వ్యత్యాసాన్నిగుర్తించుటకు పెద్దలతో సంభాషించుట ఆమోదప్రదమని కొందరు యువకు లనటం కూడా కద్దు. యువకులు సాధారణంగా తమకంటె ముందు తరంవారి అనుభవాలను, అభిప్రాయాలను, అభిరుచులను, పెంపకంలోగల తారతమ్యాలను వినగోరతారు; కాని మరొక విషయం గమనించవలసి ఉంటుంది. నాటికీ నేటికీ గల తారతమ్యాన్ని పోల్చి చూపుటకు వారు ఇష్టపడరు. వారి కది అనుకూలంగా ఉండదు. ఈనాటి యువకులు నా

చిన్నతనంలో ఉన్నట్లు చెయ్యరు-అని ఏదో పెద్దలు చెప్ప బోయే మాటలు వారికి విసుగుపుట్టిస్తవి. గత 20, 30 సంవత్సరాల్లో పరిస్థితులు ఎట్లా మారింది, పిన్న పెద్దలందరకు తెలుసు. అందుచేతనే నేటి యువజనులు అధిక స్వాతంత్ర్యాన్ని, అనుభవిస్తూ స్వేచ్ఛా సౌఖ్యంలో ఉన్నారు. ఈ నూతన వాతావరణంలో పుట్టి పెరగటంచేత వారు నూతన ప్రపంచంలో ఉన్నట్టు భావిస్తారు. పూర్వకాలానికి గాని, ఆ మార్గానికిగాని, అవి ఎంత మంచివైనా వారు సుతరామూ ఇష్టపడరు. పూర్వకాలపువారు తమకంటె సచ్ఛారిత్రులన్నమాట వారికి ఏవగింపుగా ఉంటుంది. వీరే గాదు; ప్రతివారు తమ తరాన్ని గురించి గొప్పగా చెప్పు కోవటం సహజమే. తానీషాలనాడుకూడా తండ్రులు తమ పిల్లలు పాడైపోతున్నారని ఆక్రోశించారు. యువజనులు అర్హతలేనివారి విమర్శలను పాటించరు. నాటికి నేటికి చాలా తేడా ఉన్నదనీ, పూర్వ జీవితం చాలా సుఖమైన దనీ నేటి సాధక బాధకాలు పెద్దలు గ్రహించలేరని వారి భావన.

ఈ ధోరణితోనే సలహా, విమర్శన లుంటాయి. అత్యూచితంగానే పెద్దలు సలహాలు ఇవ్వబోతారు. 'నేనే ఈ దశలో ఉంటే ఆపని చేసేవాడినన్నో, ఆమాదిరిగా ప్రవర్తించటం బుద్ధిహీనతకాదా అనో ఏదోవిధంగా పిల్లలమీద విరుచుకు పడతారు. పిల్లలు పైకి అనరుగాని, 'నీ అభిప్రాయాన్ని ఎవరు అడిగారు? అడగందీ పెట్టందీ ఇవన్నీ ఎందుకు'? అని తమలో తామైనా అనుకొంటారు. నిజంగా

పెద్దవారి సలహో, అభిప్రాయం కావలసివస్తే పిల్లలు న్యాయంగానే గౌరవిస్తారు. మొత్తంమీద పెద్దవారి సలహాను పిన్నలు పాటించటానికి ఇష్టపడరు. పెద్దవారికి తమ యందు సానుభూతి లేదని, తమ స్థితిగతులు ఆలోచించి మాట్లాడరని వారి విశ్వాసం.

మరొక కష్ట మేమిటంటే, యువజనులలో అధిక సంఖ్యాకులు తీవ్రమైన విషయాలను గురించి పెద్దలతో సంభాషించుటకు జంకుతారు. వారి కాలంలోని కష్టాలను గురించి, సమస్యలనుగురించి, మాట్లాడుటకుకూడా వారు ఇష్టపడరు. ఇంతేగాదు; కొన్ని కొన్ని విషయాలనుగురించి వా తలిదండ్రులతో సంభాషించుటకు కూడా సందేహిస్తారు. తలిదండ్రులు కొందరు తమ పిల్లలయెడల ప్రేమ, అనురాగం, మొదలగునవి అధికంగా చూపించినా వారి మధ్యగల అంతరువు అట్లాగే ఉండిపోతుంది. విద్యనుగురించి, వివాహాన్ని గురించి, ఒక్కొక్కప్పుడు రాజకీయాలను గురించి భేదాభిప్రాయాలు ఉంటూనే ఉంటవి. యువకులు సాధారణంగా తమ స్వాతంత్ర్యాన్ని, చంపుకోరు. తమ అభిప్రాయాలనీ, ఆశయాలనీ, మార్చుకోరు. సాధారణంగా యువజనరక్తం వేడిగా ఉంటుంది. పాత అభిప్రాయాలనూ ఆచారాలనూ వారు వ్యతిరేకించడం సహజం. వారికి తలిదండ్రులయందు ఎంతప్రేమఉన్నా, వారొకప్పుడు ఇట్లా అంటూ ఉంటారు: "మానాన్న ఈమాట మాట్లాడటం నాకు చాలా కష్టంగా ఉన్నది." కనుక పెద్దలు పెద్దరికాన్ని నిలుపుకోవాలంటే, పిన్నలడిగే వాటికి సమాధానం ఇవ్వటమే మంచిది.

పిన్నా పెద్దా కలసి ఏదైనా ఒక విషయాన్ని గురించి తర్జన భర్జన చేస్తున్నప్పుడు పెద్దలు నిగ్రహం చూపటం అవసరం. వారు తమ స్వానుభవంతో, 'అబ్బాయీ, నీ వేమి మాట్లాడుతున్నావో నీకు సరిగా తెలియదు.' ఈ మాదిరిగా మాట్లాడటం ఏ కుర్రవాడి కయినాసరే వ్యతిరేక భావాన్ని కలిగిస్తుంది. అనుభవమే ప్రధానం కాదని వా రనుకొంటారు. నే నీ విధంగా అనుకొంటానికి నాకు హక్కు ఉన్నదని యువజనులు అనుకొంటారు. పెద్దలు తమ అనుభవాన్ని పురస్కరించుకొని, విమర్శించినప్పుడు పిన్నలు చాలా బాధపడతారు. కనుక పెద్దలు వారితో ఘర్షణ లేకుండా సమరసంగా పోవటం ఉచితం.

పిల్లల్ని పిల్లలగా గాక, మిత్రులనుగా భావించినట్లయితే తలిదండ్రులకు తగాదాలు రావు.

బాల్యంలో రాజుగానూ, కౌమారంలో మిత్రునిగానూ, పాటించవలసినదని నీతిశాస్త్రం చెపుతున్నది. కాని తండ్రులు సంతానాన్ని తమ ఆస్థిపాస్థులవలె భావించి వారిని స్వేచ్ఛగా పెరగనివ్వకుండా అడ్డు పడుచున్నందు వలననే ఈ అనర్థకాలు వస్తున్నవి.

"They have come through you not by you" పిల్లలు తలిదండ్రులద్వారా వచ్చారు. కాని, తలిదండ్రులవల్ల రాలేదన్న ఖలీల్ జిబ్రాన్ అన్నమాట సత్యం.

తానిట్లా చేశానని తలచి, తన కుమారుడు కూడా అట్లాగే చెయ్యాలని చెప్పడం సముచితంకాదు. వారి అనుభవం నేటికి సరిపోతుందని గ్రహించాలి. ఈనాటి కాల

పరిస్థితుల ననుసరించి, సమస్యలను గురించి ఆలోచించాలి. పిన్నలుకూడా పెద్దవారి స్వభావాన్ని గమనించి, వారు వృద్ధులు, వారు అట్లాకంటె మరొకవిధంగా మాట్లాడలేరని భావిస్తే యువజనులుకూడా బాధపడనవసరంలేదు. పెద్ద వారు వృద్ధాప్యంవల్ల, ఒక్కొక్కప్పుడు నిగ్రహాన్ని గోల్పో తారు. అసలు పెద్దవారెప్పుడూ తమ పాత అనుభవాలను పదిలపరచుకొంటారు, అవే గొప్పగా పిల్లలతో పదే పదే సంభాషిస్తారు. వద్దన్నా, కద్దన్నా వారు చేసే పనే అది. 'ఇదివరకు మీరు ఈసంగతి చెప్పారు' అని పిల్లలు వారిని విసిగించకుండా, వారి ధోరణికి వారిని విడిచిపుస్తే, పాపం వారు ఆ విధంగా సంతోషపడతారు!

క్షణ క్షణం మారే ఈ ప్రపంచంలో పెద్దవారు నూతన అభిప్రాయాలకుతట్టుకోలేక దిగ్భ్రాంతి చెందుతారు. వారు ఒకొక్కప్పుడు చాలా బాధపడతారు.

పైన పేర్కొన్న సాధక బాధకాలన్నీ, ప్రేమ, సానుభూతులతో తప్పించుకోవచ్చును. వారుభయులకు ఇదే మంచిమార్గం. పిన్నలయెడల సానుభూతిగల పెద్దలు, వారి అభిప్రాయాలను, ఆలోచనలను, భంగపర్చరూడదు. అటువంటివారు విని, దయాదాక్షిణ్యాలతో ఉంటారు. అట్లాగే యువజనులు పెద్దలయెడ ప్రేమ గౌరవాలతో ఉన్న ట్లయితే పెద్దవారిని బాధించుటకు ప్రయత్నించరు. ఈ విధంగా వీ రిరువురు ఉంటే బాధలేదు.

## సింహావలోకనం :

సంభాషణ ఎట్లా చెయ్యాలో కొంతవరకు మనం తెలుసుకున్నాం. సంభాషణ ఒక కళ అని, దానిని నేర్చుకో వచ్చునని గ్రహించటం అవసరం. కనుక బాగా మాట్లాడ లేనివారు తగు కృషి చేయవలసి వస్తుంది. సహజంగా వచో నైపుణ్యంగలవారికి చెప్పనవసరంలేదు. అట్టి శక్తి యుక్తులు లేనివారుమాత్రం తప్పక ప్రయత్నించవలసి వస్తుంది.

బాగాను, మనోహరంగానూ మాట్లాడాలంటే అనేక విషయా లున్నాయి. పెక్కు విషయాల్లో పరిజ్ఞానం కల వారికి మాట్లాడుటకు విషయం దొరకకపోదు. 'నాకు మాట్లాడటానికి విషయమేదీ కనపడటంలేదు' అనేవారి సంగతి గుర్తుంచుకోవాలి. 'నేనేమి మాట్లాడగలను'అంటారు కొందరు. అట్లా అంటంలో తన కిష్టమైన సంగతి ఏమీ లేదు అన్నమాట. మాట్లాడటం కష్టమనుకుంటే తగు కృషి చెయ్యాలి. వారి వారి అభిరుచులు అర్హతలనుబట్టి ఒక్కొ క్కరు ఒక్కొక్క విధంగా కృషిచేస్తారు. నే నెందుకూ పనికిరాని వాడిని అని గానీ, ఇతరుల దృష్టిలో మెలగజాలని వాడిని అని గాని తరచు అంటూ ఉండటం వింటాం. అది అతి వినయం, లేక నిరాశావాదం. నీకు ఇష్టంలేనిది ఇతరు లకు ఇష్టం కావచ్చు.

బస్సు కండక్టరుకు, దుకాణంలో పనిచేసే మనిషికి ఆ పనుల్లో ఇష్టం లేకపోవచ్చు. కాని వీరికి ప్రజల మన స్తత్వం బాగా తెలుసు. బహు జనం నిత్యం వీరితో సంబంధం

కలిగిఉంటారు. గృహకృత్యాలలో నిమగ్నులైన స్త్రీలు బజారుకువచ్చి ఏమి బావుకుంటారని అనుకుంటారు. కాని వారికి కూడా అనేక అనుభవాలు ఉంటాయి. దుకాణాలకు పోయి వస్తువులను కొనటం, బజారులోని మనుషులను చూడటం మొదలగునవి వీటిని గురించి వారు మాట్లాడ వచ్చు.

అందరూ బాగా మాట్లాడలేరనే సంగతి నిజమే. కానీ తమకు అందుబాటులోని సంగతిని గురించి ఆలోచించి ఆకర్షవంతంగా మాట్లాడటానికి కృషిచెయ్యాలి.

ఏ విషయాన్ని గురించి మాట్లాడాలో తెలియనివారు కొంత కృషిచెయ్యాలి. ఎట్లాగంటే వార్తా పత్రికలను చూస్తాం. దానిలో కొన్ని ప్రధానమైన వ్యాసాలుంటవి. వాటిని గురించి కొన్ని భావాలు కలగటం సహజం. వాటి యందు ఇష్టము అయిష్టము గూడా ఉంటుంది. అప్పుడు వాటిని గురించి మాట్లాడటం చాలా సులభం. కాకపోతే తెలియని విషయాలను తెలుసుకోవటం జరుగుతుంది. కొన్ని పట్టణాలలో మ్యూజియములు, పార్కులు ఉంటవి. అక్కడికి చాలామంది వెళ్ళుతారు. అట్లా వెళ్ళటం నీకు ఇష్టం లేకపోతే వారు కాలాన్ని ఎలా వృధా చేస్తున్నారో దానిని గురించి మాట్లాడవచ్చు. అది నచ్చేటట్లైతే వాటికి సంబంధించిన పుస్తకాలు చదివి యింకా అనేక సంగతులు నేర్చుకోవచ్చు. ప్రపంచంలో సుఖశాంతులు చాలామంది గోల్పోవటానికి కారణం 'దానిలో ఏముందిలే' అని అనుకోవడమే.

దీనికి సాదృశ్యంగా ఒకసంగతి చెబుతాను. కొందరు మహాబలిపురం చూడడానికి ఒక కారుమీద వెళ్ళారు. ఆ డ్రైవరు అనేకసార్లు వచ్చినవాడే. కానీ అతను ఎప్పుడూ చూడాలని తలచలేదు. ఒకనాడు అందులో వచ్చినవారు ఆ డ్రైవరునుకూడా వెంటపెట్టుకొని వెళ్ళదలచారు. ఆయన రానన్నాడు. కాని వారు పదే, పదే చెప్పడంవల్ల వచ్చాడు. మొట్టమొదట ఆయనకేమీ నచ్చలేదు. కాని అవన్నీ చూచినందువల్ల ఆయనకు కూడా అభిరుచి కలిగింది. అనంతరం ఆయనకు వీటియందు అభిమానం అధికమై వాస్తు శాస్త్రాలు చదవసాగాడు. అభిరుచి, అభిమానం కలగకపోతే బాగా మాట్లాడటానికి కృషిచెయ్యాలి. ఇతరులకు నచ్చే టట్లుగా మాట్లాడటం గ్రహించటం అవసరం. అభివృద్ధి అనేది ఏదీ దానంతట అది రాదు. నిరంతరం కృషిచేస్తూ ఉండాలి. దీనివలనే అభివృద్ధి గాంచగలమనేది గుర్తుంచు కోవాలి. నీకు ఏది ఇష్టమో దేనినిగురించి బాగా మాట్లాడ గలవో ఆ విషయాన్ని గురించి మాట్లాడటం మంచిది.

సంభాషణంటే కథమాదిరిగా ఒకరు చెప్పటం; ఒకరు వినటంకాదు. ఉభయులు కలసి మాట్లాడుకోవటం, సంప్రదించుకోవటం. ఆ పద్ధతి ఉభయులకు ఉపయోగకారి. సంభాషణ అంటే గోళ్ళు గిల్లుకుంటూ కూర్చోవటంకాదు. అవతలమనిషి మాట్లాడేదానిమీద నీ అభిప్రాయంచెప్పటం. ఒకరు మాట్లాడుతూఉంటే మరి ఒకరు "అచ్చా, బాగుంది అదే నేను ఆలోచించేది" అని అనరాదు. సంభాషణఅంటే చదరంగం వంటిది. ఇద్దరూ పాల్గొని ఆడాలి. ఒకరు

మాట్లాడుతుంటే రెండవవ్యక్తి కేవలం వినటం సంభాషణ కానేకాదు. అది ఉపదేశం, నీతిబోధ అవుతుంది. సంభాషణ అనగా ఇద్దరు కలిసి సంప్రదించుకోనటం అన్నమాట. ఒకరు ఒక విషయం చెప్పితే, రెండవవారు దానినిగురించి తమ అభిప్రాయాన్ని కూడా వెల్లడించాలి. 'ఆయనతో మాట్లాడాను. చాలా అద్భుతంగా ఉన్నది. అటువంటిది ఎప్పుడూ వినలేదు.' అనటం సంభాషణకాదు. అట్లామాట్లాడే వ్యక్తికి విషయవైవిధ్యం లేదనీ, ఆయన చెప్పినవారిదగ్గర నుండీ చాలా విషయాలు తెలుసుకున్నాడన్నమాట. నీవు వినటంకాదు, నీకు తెలిసిన విషయాలను గురించి ఇతరులతో మాట్లాడటం, దానిపై ఇతరులు మాట్లాడటం అదీసంభాషణ

సంభాషణఅంటే ఒకరు చెప్పుతూఉంటే ఊకొట్టటం కాదు, కలసి మెలసి మాట్లాడటం. రెండవవారు మాట్లాడు తుంటే బిడియపడి మాట్లాడకుండా ఉండరాదు. తాను కూడా మాట్లాడ ప్రయత్నిస్తే ఆ బిడియము అదేపోతుంది. Practice makes a man perfect. సాధనమున పనులు సిద్ధిస్తాయి. ఎవరూ ఏవిషయాలను పుట్టుకతోనే నేర్చుకొని రాలేదు. నిరంతర సాధనవల్లనే గొప్పవారు కాగలరు.

గొప్ప తెలివితేటలు గలవారుకూడా సంభాషణలో గొప్పవారు కారు. కవులు, గాయకులు, రాజకీయవేత్తలు ప్రఖ్యాతులై ఉండవచ్చును. వారి వారి వృత్తులలోనే ప్రఖ్యాతులుగాని సంభాషణలో అందరూ రాణించరు. దీనికి కారణం వారు వారి సంబంధంలేని విషయాలలో జోక్యం కలుగచేసుకోకుండా ఉండటమే. అందుచేతనే వారి

దగ్గరకు వెళ్ళినప్పుడు వారు మనలను హర్షింప జేయలేరు. వారుకూడా భిడియపడిమాట్లాడటానికి జంకుతారు. ఇదంతా చూచి సాధారణ వ్యక్తి కొంచం తృప్తిపడవచ్చు. సంభాషణలో శ్రద్ధ తీసుకుంటే తెలివిగలవారికంటె అధికముగా మాట్లాడగలరు.

సిగ్గు, మౌనం సంభాషణలో పాల్గొన ఇష్టం లేకుండా ఉండటం, ఎంత చెడ్డదో రెండవవారికి అవకాశం ఇవ్వకుండా ఎప్పుడూ తానే చెవికోసిన నక్క-మాదిరి మాట్లాడటం అంతకంటె చెడ్డది. ఆ వినే వ్యక్తి ఈ మాటలపోగు నాకు ఎక్కడ దాపురించాడురా! అని అనుకుంటాడు. ఇది సాధారణంగా జరిగే పద్ధతి.

లోకంలో అతిగా మాట్లాడేవారు, నోరు మెదపని వారు అధికంగా ఉన్నారు. సక్రమంగా సంభాషణ చేసే వారు స్వల్పం. కనుక ఈ రెండు చెడ్డ గుణాల నుండి తప్పించుకుని బాగా మాట్లాడటం నేర్చుకోవాలి. అతిగా మాట్లాడేవారు అవతలవారు తన మాటలు వినటానికి ఇష్టంగా ఉన్నారో లేదో, వారి ముఖాలు పరీక్షించాలి. కనుక అతిగా మాట్లాడే మనిషి జాగ్రతవహించి, అవతల మనిషికి కూడా మాట్లాడే అవకాశం ఇవ్వాలి.

లోకంలో గొప్ప అనుభవజ్ఞులు అతి తెలివితేటలు గలవారు ఈ విషయమై గుర్తుంచుకోవాలి. ఎప్పుడూ తన సొద చెప్పుకునేవారి మాటలు ఎవరూ వినరు. వారికి మర్యాద-మన్నన తగ్గుతుంది.

మాట్లాడేవారు సర్వము తనుకే తెలుసని దృష్టితో మాట్లాడుతుంటే, వినేవారు బుద్ధిహీనులని దృష్టితో వినటానికి అంగీకరించరు. మాట్లాడటం ముగించిన తరువాత అది నా అభిప్రాయం ఇది నీ కెంత నచ్చుతుంది అనాలి వివేక వంతుడు. అంతేకాని తాను చెప్పిందే సరని, తాను చెప్పిందంతా అంగీకరించనివారు మూర్ఖులని తలచరాదు.

సంభాషణలో మరొకదోషం స్వోత్కర్ష. ఆత్మస్తుతి, పరనింద ఎప్పుడూ పనికిరాదు. కొందరు పరోక్ష పద్ధతిని స్వోత్కర్ష ప్రారంభిస్తారు. సంభాషణలో ఇవన్నీ తప్పులే.

మరొకదోషం, ఒకరు మాట్లాడుతుంటే ఆ మనిషిని సొంతం మాట్లాడనీక తనకు ఇష్టం లేనప్పుడు ఎదుర్కొంటారు, వ్యతిరేకిస్తారు. చివరివరకు వినే ఓర్పు లేకపోవటం మంచి పద్ధతి కాదు. ఓర్పు, సహనం ఉండాలి. ఒకరు మాట్లాడిన తరువాత మరొకరు మాట్లాడటం సభ్యత.

సంభాషణలో మొదటి సంగతి మర్యాదగా ప్రవర్తించటం. ఎదటిమనిషి మాట్లాడుతుంటే వినటం ధర్మం. అది ఇష్టం ఉన్నా, ఇష్టం లేకపోయినాసరే. ఇతరుల మనస్సుకు కష్టం కలిగేటట్లు సంచరించరాదు. మన్నన పొందాలంటే సంభాషణలోగాని, వాదనలోగాని మర్యాదగామాట్లాడాలి. అప్పుడు ఆ మాటలు అందరూ హర్షంతో వింటారు. ఇతరుల అభిప్రాయాలను ఖండించ దలచుకుంటే పెద్ద గొంతుతోను, కోపంతోనూ మాట్లాడరాదు. సకారణంగానూ, శాంతంగానూ మాట్లాడుతుంటే అందరూ బాగా వింటారు.

రేడియోలో ఒకరు మాట్లాడిన తర్వాత మరిఒకరు మాట్లాడుతుంటె వినటం మనకెంతో ఇంపుగా ఉంటుంది. అక్కడకూడా చర్చలలో పాల్గొని నెమ్మదిగా, శాంతంగా ఒకరి అభిప్రాయాలను మరిఒకరు విమర్శించుకుంటారు. వాదాలతో దిగి త్వం శుంఠం అంటే త్వం శుంఠ అనుకోవటం మంచిది కాదు.

ఎదటి మనిషిని మాట్లాడనివ్వడం మర్యాద. అవతల వ్యక్తి సిగ్గుపడుతున్నప్పుడు దానిని పోగొట్టి మాట్లాడటానికి ప్రోత్సహించాలి. నీ సంగతి నీవు చూచుకోవటం మంచిది కాదు. ఎదుటివారి సంగతి గమనించటం మంచిది.

త్రికరణశుద్ధి, మర్యాద ఉండటం మంచిది. ఆత్మ వంచన, పరవంచన మంచిది కాదు.

ఇతరుల ఆలోచనలు అభిప్రాయాలు వినటానికి కుతూహల పడాలి. జ్ఞానాన్ని ఇచ్చి పుచ్చుకోవాలంటే తెలిసింది తెలుపు. ఇతరులు చెప్పేది విను. వారి మాటలు వినటం ఇష్టమున్నట్లు వర్తించాలి. అవి వినసొంపుగా లేక పోయినా వినటం ధర్మం. అతను ముగించిన అనంతరం ఇష్టమైన సంగతిని గురించి నీవు మాట్లాడు.

సంభాషణ అంటే ఒకరు నొకరు గౌరవించుకోవటం- సమాన ప్రతిపత్తి చూపటం. ఇతరులయెడ మర్యాదగా ప్రవర్తించడం అభివృద్ధికి మంచి మార్గం. ఇతరులతో సంభాషించేటప్పుడే మనిషి సంస్కారం కనిపించేది.

సరియైన సంభాషణ గురించి తుదిమాట చెప్తున్నాను. అది అధికంగా నిస్వార్థం, నిష్కాపట్యంమీద ఆధారపడి ఉంటుంది. ఇతరుల ఆనందాన్ని గురించి ఆలోచించటం సిగ్గుతో మాట్లాడలేని వారిని ప్రోత్సహించి మాట్లాడేటట్లు చేయటం, తన లోపాలను దిద్దుకోవటం. నీ విధిని నీవు నిర్వర్తించటం కర్తవ్యం.

నిత్యమూ కొత్త సంగతులు తెలుసుకోవటం, నూతన అభిప్రాయాలు గ్రహించటం అవసరం. ఈ విధంగా చేస్తూ ఉంటే ఇతరులు నీ మాటలను చెవి యొగ్గి వింటానికి ఇష్టపడతారు. ఇది కొంచెం కష్టమైనపని కావచ్చు. కాని అభివృద్ధి నిరంతరం పరిశ్రమవలనే లభిస్తుంది. నిత్యమూ చదవటం, లోకంలో జరిగే సంగతులను సరిగా గ్రహించటం, కళ్ళనూ చెవులనూ సరిగా ఉపయోగించటం చేయవలసిన పని. పంచేంద్రియాలను నీ అభివృద్ధికై ఉపయోగించాలి. ఈ మాదిరి సాధన నీ అభివృద్ధికి ఆధారభూతంగా ఉంటుంది.

కనుక పరిశ్రమ అవసరం. కొందరు సహజంగా ప్రతిభావంతులు. కానివారు కొద్దిమంది మాత్రమే. సంభాషణ సరిగా చేయాలనుకునే ప్రతివారు ప్రయత్నించాలి. అట్లా కృషిచేసే మనిషి నిజంగా జయం గాంచగలడు. నిన్ను గురించి గాక ఇతరుల గురించే ఆలోచిస్తే ప్రయోజనం ఏమిటి? కనుక ఏవిధంగా సంభాషణలో ఇతరులను ఆనందింప చేయగలవో ఆ సంగతులను నేర్చుకుంటే నీవు మంచి సంభాషణ కర్తవు కాగలవు.

—— ••• ——

# అనుబంధం

## ౧

కం॥ ఎదిరికి హితమును బ్రియమును
మదికింపును గాఁగఁ బలుక మాటలు పెక్కై
యొదవినను లెస్స యటు గా
కిది యది యన కూరకున్కి యెంతయు నొప్పుచున్.

కం॥ చెలిమియుఁ బగయును దెలివియుఁ
గలఁకయు ధర్మంబు బాపగతియును బెంపుం
దులువతనంబును వచ్చును
బలుకఁబడినఁ గాన పొసఁగఁ బలుకఁగవలయున్.

చం॥ పలుకక యుండుకంటెఁ దగఁ బల్కుట మేలు, వినందు సత్యముం
బలుకుట ధర్మమార్గమునఁ బల్కుట సర్వజనప్రియంబుగాఁ
బలుకుట యోలి. నెక్కు డగు భంగులు వాని నెఱింగి
యొండుమైఁ
బలుకక నాల్గుచందములఁ బల్కఁగ మెత్తురు వాని దేవతల్.

కం॥ తనువున విరిగిన యలుగుల
ననువునఁ బుచ్చంగవచ్చు నతి నిష్ఠురతన్
మనమున నాఁటిన మాటలు
విను మెన్ని యుపాయములను వెడలునె యధిపా!

కం॥ మనమునకుఁ బ్రియంబును హిత
మును బథ్యముఁ దథ్యమును నమోఘము మధురం
బును బరిమితమును నగు పలు
కొనరఁగఁ బలుకునది ధర్మయుతముగ సభలన్.

కం॥ చెలిమియు సంభాషణమును
బలిమి వివాదంబు ద్రోపుఁ బాడియుఁ దమయం
తల వారితోన తగు నధి
కుల హీనుల తోడనైనఁ గొఱగాదధిపా!

కం॥ మృదుమధుర వాక్యముల నిం
పొదవెడు చిఱునవ్వుతోడ నుర్వీశుఁడు స
మ్మదము సచివులకుఁ బ్రజలకు
నొదవింపఁగ వలయునది మహోన్నతి చేయన్.

తే॥ ఈగియును బ్రియవచన సంయోగమునన
కాని జనులకు సంతోషకారి గాదు
పుచ్చికొనునప్పు పల్కుల పొందు గలిమి
యెదిరి మదిగంద నీదింత యెఱుఁగు మధిప !

ఆ. వె. మాటమిగులు లోకలె దాఁటి చూపుట కాదు:
మాటపడినవాఁడు మఱచిపోఁడు,
మాట కఱకుఁదనము మనలానే నఱకురా !
వాస్తవమ్ము నార్లవారి మాట

ఆ. వె. అల్పుఁడెపుడు బల్కు నాడంబరముగాను
సజ్జనుండు పల్కుఁ జల్లఁగాను
కంచుమ్రోగునట్లు కనకంబు మ్రోగునా
విశ్వదాభిరామ వినుర వేమ !

"అమలమైన పలుకు లభిషేక వారిధి"—
పక్కి తెలిసి పలుక నొక్కవాక్యమె చాలు
పెక్కులేల? వట్టి ప్రేల్పులేల ?—

మాటల మాటలు వచ్చును
మాటలనే గల్గుచుండు మణిమంత్రంబుల్
మాటల పొందిక తెలిసిన
మాటలనే ముక్తి కలుగు మహిలో వేమా !

వాఙ్మాధుర్యాన్నాన్య దస్తి ప్రియత్వం
వాక్పారుష్యాచ్చోపకారోఽపి నష్టః
కింత ద్రవ్యం కోకిలే నోపనీతం,
కోవాలోకే గార్ధభస్యాపరాధః

ఉ. భూషలుగావు మర్త్యులకు । భూరిమయాంగద తార
హారముల్
భూషిత కేశ పాశమృదు। పుష్పసుగంధ జలాభిషేకముల్
భూషలుగావు పూరుషుని।భూషితుఁ జేయుఁబవిత్రవాణివా
గ్భూషణమే సుభూషణము । భూషణముల్ నశియించు
నన్నియున్

చ. ఎదిరిమనంబు నోవనటు లెంతయు నింపుగఁ బల్కువారలం
బదుగురు గారవింపుదురు; ప్రల్లదులం దరిఁ జేరనిత్తురే?
ముదముఁ గీరశారికల ముద్దుగఁ బంజరమందు నుంచి పెం
చెద; రలకాకులం జెదరఁ జేయరె చీఁదరఁ జెంది?
మిత్రుఁడా!

చ. సమయ మెఱింగి పల్కు విలసన్మృదువాక్కులు వోలెఁ దీవ్రవా
క్యము లొనరింపనేర వాడికంబుగఁ గార్యపుసిద్ధి; నెట్లనం,
బ్రమద మెసంగ రాల్చు ప్రభాతపుశీతలవాతపోతముల్
సుమఫలముల్; శిలాటువుల డుల్చునుగా పెనుగాలి!
మిత్రుఁడా!

చ. వ్యపగతమార్దవంబులు మహాప్రియముల్ పమయానుకూలమా
లపితము, లట్లుకాని మృదులంబులు నప్రియముల్ నుడుల్; ప్రభా
తపుఁదఱిఁ గాశ కుక్కుటరుతంబు హితంబగు నెంతయున్; వియో
గపు సమయంబునన్ శుకపికస్వర మార్తికరంబు;
మిత్రుఁడా!

ఉ. ధీరుఁడు జానుగుల్ సాగియుఁ, దేనియ లొల్కఁగఁ, బల్కు
వొల్లగాఁ;
జేరిన వారికిం జెవులు చిల్లులువోవఁగ నాడు నీచు; డిం
డీరరసానుకారికలనిక్వణనం బొనరించు వీణియల్;
వీరణముల్ రణంబు నొదవించును దారుణభంగి;
మిత్రుఁడా!

# CONVERSATION

"It is good to rub and polish our brain against that of others." -Montaigne.

"One of the best rules in conversation is never to say a thing which any of the company can reasonably wish had been left unsaid"

-Swift.

"Among well-bred people, a mutual deference is affected; contempt of others disguised; authority concealed; attention given to each in his turn; and an easy stream of conversation is maintained, without vehemence, without interruption, without eagerness for victory, and without any airs of superiority." -Hume.

"To listen well, is as powerful a means of influence as to talk well, and is as essential to all true conversation."

"Know how to listen, and you will profit even from those who talk badly."

-Plutarch.

"Great talent for conversation should be accompanied with great politeness. He, who eclipses others owes them great civilities; and what ever mistaken vanity may tell us, it is better to please in conversation than to shine in it.

The art of conversation consists as much in listening politely, as in talking agreeably"
—Atwell.

"I don't like to talk much with people who always agree with me. It is amusing to coquette with an echo for a little while, but one soon tires of it."
—Carlyle.

"He who sedulously attends, pointedly asks, calmly speaks, coolly answers, and ceases when he has no more to say, is in possession of some of the best requisites of conversation."
—Lavater.

"Never hold any one by the button, or the hand, in order to be heard out; for if people are unwilling to hear you, you had better hold your tongue than them."
—Chesterfield.

"Silence is one great art of conversation."
—Hazlitt.

"Conversation is an art in which a man has all mankind for competitors." —Emerson.

"The tone of good conversation is brilliant and natural—it is neither tedious nor frivolous-it is instructive without pedantry; gay, without tumultuousness; polished without affectation; gallant, without insipidity; waggish, without equivocation.
—Rousseau.

"Not only to say the right thing in the right place, but far more difficult, to leave

unsaid the wrong thing at the tempting moment". —Sala.

"It is a secret known to but few, yet of no small use in the conduct of life, that when you fall into a man's conversation, the first thing you should consider, is whether he has a greater inclination to hear you, or that you should hear him" —Steele.

"Our companions please us less from the charms we find in their conversation, than from those they find in ours."

—Greville.

"There cannot be a greater rudeness than to interrupt another in the current of his discourse." —Locke.

"The less men think, the more they talk."

—Montesquieu.

"He kept up with the current literature, and distilled from it a polite essence, with which he knew how to perfume his conversation." —William Dean Howells.

"Speak well of every one if you speak of them at all—none of us are so very good."

—Elbert Hubbard.

"Be sincere. Be simple in words, manners and gestures. Amuse as well as instruct. If you

can make a man laugh, yon can make him think and make him like and believe you—"

—Alfred E. Smith

"My observation is that, generally speaking, poverty of speech is the out ward evidence of poverty of mind" —Bruce Barton.

"Conversation is the laboratory and work shop of the student.

—Ralph Waldo Emerson.

"Take as many half minutes as you can get, but never talk more than a half minute without pausing and giving others on opportunity to strikein." —Swift.

"Conversation opens our views, and gives our faculties a more vigorous play; it puts us upon turning our notions on every side and holds them up to a light that discovers those latent flaws which would probably have lain concealed in the gloom of unagitated abstraction" —Melmoth.

"The pith of conversation does not consist in exhibiting your own superior knowledge on matters of small importnce, but in enlarging, improving, and correcting the information you possess, by the authority of others"

—Walter Scott.

"Repose is as necessary in conversation as in a picture." —Hazlitt.

"Conversation shoud be pleasant without scurrility, unity without affectation, free without indecency, learned without conceitedness, novel without falsehood." —Shakespeare.

"One would think that the larger the company is the greater variety of thoughts and subjects would be started in discourse; but instead of this, we find that conversation is never so much straitened and confined as in large assemblies." Addison.

"In company it is a vary great fault to be more forward in setting of one's self, and talking to show one's parts them to learn the worth, and be truly acquainted with the abilities of men.-He that makes it his business not to know, but to be known, is like a foolish tradesman, who makes all the haste he can to sell off his old stock, but takes no thought of laying in any new." —Charron.

"Conversation warms the mind, enlivens the imagination, and is continually starting fresh game that is immediately pursued and taken, which would never have occurred in the duller intercourse of epistolary correspondence". -Franklin

"To speak and to speak well are two things. A fool may talk, but a wise speaks."

—C. Simon.

"We cannot always oblige, but we can always speak obligingly." —Voltain.

"A fool's heart is in his tongue; but a wise man's tongue is in his heart. —Quarles.